## బొంబాయి రైల్వే ప్రమాదం పై విచారణ ప్రారంభం

బొంబాయి, జూన్ 3: నిన్న ఇక్కడ జరిగిన రైల్వే ప్రమాదంపై రైల్వే ఇన్‌స్పెక్టరు డి. సి. దేశాయ్ రహస్య విచారణ ప్రారంభించారు. ఈ ప్రమాదంలో 18 మంది మరణించారు. 66 మంది గాయపడ్డారు.

## శ్రీ వి. వి. గిరి

మద్రాసు జూన్ 3: ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా నియమితులైన శ్రీ వి. వి. గిరి నిన్నరాత్రి కలకత్తా మెయిలులో బరంపురంమీదుగా లక్నోకు బయల్దేరి వెళ్లారు.











## గుంటూరు జిల్లాలో అంబర్‌చర్ఖా శిక్షణ

### 4 కేంద్రాల ఏర్పాటు

తెనాలి, మే 30: గుంటూరు జిల్లా ఇంకొల్లు, దగ్గుబాడు, ఇంటూరు, పెదపూడిలలో అంబర్ చర్ఖా శిక్షణాలయాలను ఏర్పాటు చేశారు.

ఇంకొల్లులో అంబర్ చర్ఖా శిక్షణ కేంద్రానికి ఈనెల 25 న శ్రీ అక్కల కోటయ్య ప్రారంభోత్సవం చేశారు. శ్రీయుతులు ఎమ్. వి. రమణయ్య, చుండి రామమూర్తిగారలు ప్రసంగించారు. సభకు శ్రీ నల్లమోతు సుబ్బారావు అధ్యక్షత వహించారు.

దగ్గుబాడులో అంబర్ చర్ఖా శిక్షణాలయానికి కూడా ఈ నెల 25 న శ్రీ అక్కల కోటయ్య ప్రారంభోత్సవం చేశారు. సభకు శ్రీ సయ్యద్ దాదాసాహెబ్ అధ్యక్షత వహించారు. శ్రీ చుండి రామమూర్తి ప్రసంగించారు. శ్రీ కొండా వెంకటరెడ్డయ్య వందన సమర్పణ చేశారు.

ఇంటూరులో అంబర్ చర్ఖా శిక్షణాలయానికి తెనాలి డిప్యూటీ కలెక్టరు శ్రీ కె. సత్యనారాయణ ప్రారంభోత్సవం చేశారు. సభకు శాసనసభ్యుడు శ్రీ ఆలపాటి వెంకటరామయ్య అధ్యక్షత వహించారు. డిప్యూటీ రిజిస్ట్రార్ శ్రీ జి. వి. శ్రీనివాసులు నాయుడు పతాకోత్సవం చేశారు. శ్రీ రెడ్డి బత్తుల రామిరెడ్డి వందన సమర్పణ చేశారు.

పెదపూడి గ్రామంలో మహిళా సమాజం అధ్వర్యాన అంబర్ చర్ఖా శిక్షణాలయానికి శాసన సభ్యుడు శ్రీ ఆలపాటి వెంకటరామయ్య ప్రారంభోత్సవం చేశారు. సభకు తెనాలి డిప్యూటీ కలెక్టరు శ్రీ కె. సత్యనారాయణ అధ్యక్షత వహించారు. పంచవర్ష ప్రణాళికలో జరిగే పనులను వివరించే ఫిలిమ్‌లను శ్రీ ప్రతివాది భయంకరాచార్యులు ప్రదర్శించారు. శ్రీ దేశభక్తుని రత్నయ్య వందనసమర్పణ చేశారు.

## అభివృద్ధి పనులలో పోలీసుల పాత్ర

### సంగటుపల్లి వద్ద రోడ్డు నిర్మాణం

కడప, మే 30: ఇక్కడకు సుమారు 10 మైళ్ళ దూరంలో ఉన్న సంగటుపల్లి గ్రామంవద్ద పోలీసులు శ్రమదానంతో నిర్మిస్తున్న 5½ ఫర్లాంగులరోడ్డు పనికి జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ వై. సత్యనారాయణ ప్రారంభోత్సవం జరిపారు.

ప్రాంతీయ అభివృద్ధిశాఖ అసిస్టెంట్ ఇంజనీర్ శ్రీ వై. రామకృష్ణరావు మాట్లాడుతూ ఈ రోడ్డు నిర్మాణానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రజలు రు 15 వేలుచొప్పున విరాళాలు ఇచ్చారని తెల్పారు.

జిల్లా పోలీసు సూపరింటెండెంట్ రోడ్డు నిర్మాణాన్ని ప్రారంభిస్తూ ప్రజలు పోలీసుల పట్ల మిత్ర భావంతో ప్రవర్తించాలని కోరారు. మద్యనిషేధ కార్యక్రమాన్ని అమలు జరపవలసిన బాధ్యత కూడా ప్రస్తుతం పోలీసు శాఖే నిర్వహిస్తోంది కాబట్టి ప్రజల సహకారం లేనిది ఈ పని సాధ్యం కాదని ఆయన అన్నారు.

జిల్లా ప్రణాళికా శాఖాధికారి శ్రీ రామసింగ్ ప్రసంగిస్తూ దేశపునర్నిర్మాణ కార్యక్రమాలలో పోలీసులు చాలా ముఖ్యమైన పనులను చేయవలసిఉన్నదన్నారు. ప్రజలు కూడా పురాతన భావాలను విడనాడి పోలీసులతో సహకరించి పనిచెయ్యాలని ఆయన విజ్ఞప్తి చేశారు. జిల్లా సమాచార శాఖాధికారి శ్రీ సి. రంగనాథంకూడా మాట్లాడారు.

ఒక పోలీసు ఉద్యోగి ప్రజలకు, పోలీసు దళానికీ మధ్య ఉండవలసిన సంబంధాలను వివరించే గీతం గానం చేసిన తరువాత రోడ్డుపనిని శ్రీ సత్యనారాయణ ప్రారంభించారు. కార్యక్రమంలో రిజర్వుదళానికి చెందిన 100 మంది పోలీసులు పాల్గొన్నారు.

(స్వ. వి.)

## కోరికలు నెరవేరేదాకా ఆందోళన

### కడపజిల్లా గ్రామోద్యోగుల నిర్ణయం

కడప, జూన్, 1: గ్రామోద్యోగుల వేతనాలను పెంచడానికి ప్రభుత్వం అంగీకరించే దాకా ఉద్యమం సాగించాలని కడపజిల్లా గ్రామోద్యోగుల సంఘం నిర్ణయించింది. నిన్న జరిగిన ఈసమావేశానికి శ్రీ ఆర్. రంగనాథన్ అధ్యక్షత వహించారు.

రాయలసీమ గ్రామోద్యోగుల సంఘం ఆదేశానుసారం 250 మంది గ్రామోద్యోగులు తమ రాజీనామాలను సంఘానికి సమర్పించారు. ఈ నెల 3 వ తేదీన రెవెన్యూ మంత్రితో సంఘ ప్రతినిధులు జరిపే చర్చలు విఫలమైతే ఈ రాజీనామాలను ప్రభుత్వానికి అందచేస్తారు.

## రఘునాధమల్ బ్యాంకుపనివారి తగాదా

హైదరాబాదు, మే 31: బ్యాంకు పనివారి తగాదా సందర్భంలో ఇచ్చిన తీర్పును అమలుజరపవలసినదిగా కోరుతూ సికిందరాబాదులోని జి. రఘునాథ్ మల్ బ్యాంకుపనివారు, ఆ బ్యాంకు కార్యాలయం ఎదుట నిన్న సాయంకాలం ప్రదర్శన జరిపారు.

## ఉపాధ్యాయుల వేతనాల సమస్య

### ప్రభుత్వానికి విజ్ఞప్తి

హైదరాబాదు, జూన్ 2: తెలంగాణా ప్రాంతంలోని ఉపాధ్యాయుల వేతనాలను తగ్గించడానికి ప్రయత్నించే బదులు ఆంధ్రప్రాంతంలోని ఉపాధ్యాయుల వేతనాలను పూర్వ హైదరాబాదుప్రభుత్వ వేతనాల స్థాయికి పెంచవలసినదిగా ప్రభుత్వానికి హైదరాబాదు రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం అధ్యక్షుడు శ్రీ కె. వి. రాఘవాచారి విజ్ఞప్తి చేశారు. విజ్ఞప్తిలో ఇట్లా ఉన్నది: "ఉపాధ్యాయులపట్ల ప్రధాని శ్రీ నెహ్రూ మొదలుకొని నాయకులందరూ సానుభూతిని ప్రకటించి వారే దేశ్ గొప్పపనులు చెయ్యాలని అంటున్నారు. పునర్నిర్మాణ కార్యక్రమంలో ఉపాధ్యాయులు శ్రద్ధగా పనిచెయ్యాలని ఆశిస్తున్నారు. ఈ ఆశలను ఉపాధ్యాయు లెన్నడూ వమ్ము చేయలేదు."

"ఉపాధ్యాయుని ఆర్థికపరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉన్నది. వారి అభ్యున్నతికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈ కృషిలో ఉపాధ్యాయులకు కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు సహాయపడినవి. అట్లా సహాయపడినవాటిలో పూర్వ హైదరాబాదు రాష్ట్రప్రభుత్వం ఒకటి."

"ఇక ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత ఉపాధ్యాయులకు మరీ అన్యాయం జరిగే ప్రమాదం ఏర్పడింది. ఒకే ఒక రాష్ట్రంలో ఒకే వృత్తి చేసే వారికి రెండు రకాల వేతనాలను ఇవ్వడానికి వీలులేదంటున్నారు. సెలవులు కావటంవల్లనైతేనేమి, ఇతర కారణాలవల్ల నైతేనేమి 1956 నవంబరు మొదటి తేదికి పూర్వం ఉద్యోగాలలో చేరలేకపోయిన ఉపాధ్యాయులు పూర్వ హైదరాబాదు వేతనాల పద్ధతిలో వేతనాలు తీసుకునే అవకాశం లేకుండాపోయింది. తాత్కాలికంగా ఉద్యోగాలలో ఉన్నతి ఇచ్చారనే కారణాన ఈ విద్యా సంవత్సరం ఆఖరున వందలాది ఉపాధ్యాయులను తక్కువ ఉద్యోగాలలోకి పంపించారు. కొత్తగా నియమించే ఉపాధ్యాయు లందరికీ పూర్వ హైదరాబాదు వేతనాలనే ఇవ్వడం ద్వారా న్యాయం చేయవలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను."

## కాకినాడ నాన్‌గెజెటెడ్ ఉద్యోగిసంఘభవనం

### జిల్లా కలెక్టరు చే ప్రారంభోత్సవం

కాకినాడ, మే 29: నాన్‌గెజెటెడ్ ఉద్యోగిసంఘ నూతన కార్యాలయ భవనానికి 26 వ తేదీన జిల్లాకలెక్టరు శ్రీ.ఎ. కృష్ణస్వామి ప్రారంభోత్సవంజరిపారు. సభకు పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ దంటు భాస్కరరావు అధ్యక్షత వహించారు. జిల్లా నాన్‌గెజెటెడ్ ఉద్యోగి సంఘకార్యదర్శి శ్రీ బి. ఆర్. కృష్ణరావు భవన నిర్మాణానికి జరిగిన కృషిని వివరిస్తూ కలెక్టరు రు 500 విరాళం ఇచ్చారని తెల్పారు.

శ్రీ కృష్ణస్వామి తమ ప్రసంగంలో ఉద్యోగులు, సాంస్కృతిక కార్యక్రమాలలోను, వ్యాయామ క్రీడలలోను పాల్గొని మానసిక విశ్రాంతిని పొందాలని సలహా చెప్పారు. సభాధ్యక్షుడు మాట్లాడుతూ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిర్విఘ్నంగా కొనసాగేందుకు నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల జీతాలు పెంచి వారిని సంతృప్తిపరచటం అవసరమన్నారు.

ఉద్యోగిసంఘ అధ్వర్యాన ఈ నెల 18,19 తేదీలలో ప్రదర్శించిన నాటికలలో ఉత్తమ నటకులుగా ఎన్నికైన శ్రీయుతులు సి. పురుషోత్తం, రసూల్ గారలకు ప్రత్యేక బహుమానాలు లభించాయి.

సభకు శాసనసభ్యుడు శ్రీ ఎం. వల్లం రాజు, కలెక్టరు భార్య శ్రీమతి ఇందిరా కృష్ణస్వామి ప్రభృతులుహాజరయ్యారు.

(స్వ. వి.)

## రష్యాలో బాంబుపేలిస్తే నార్వేలో ఒక్కటికీ మిగల్దు

వార్సా, జూన్ 2: రష్యా ఉత్తర ప్రాంతంలో ఒక పెద్ద ఉదజనిబాంబు పేలిస్తే, నార్వేలో ఒక్క కోటికీ అద్దం కూడా మిగలకుండా ముక్కలైపోతుంది అని రష్యా కమ్యూనిస్టు కార్యదర్శి శ్రీ క్రుశ్చేవ్ మాస్కోలో పోలిష్ విలేఖరులతో ప్రసంగిస్తూ అన్నారట.

## కీ. శే. ముప్పన సోమరాజుగారు

సిద్ధాపురం, మే 28: సుమారు 50 సంవత్సరాలక్రితం పట్టణంలో పట్టు పరిశ్రమను ప్రవేశపెట్టి అభివృద్ధిచేసి 3 వేల కుటుంబాలకు జీవనోపాధి కల్పించిన ప్రముఖులు శ్రీ ముప్పన సోమరాజు నేటి ఉదయం స్వర్గస్థులైనారు. వీరి వయస్సు 84 సంవత్సరాలు.

వీరు పట్టణంలో ఉన్నత పాఠశాల నిర్మించారు ప్రస్తుత పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ ముప్పన రామారావుకు వీరు పెదతండ్రి.

వీరి మృతికి సంతాప సూచకంగా దుకాణాలన్నీ నేడు మూసివేశారు. సుమారు 4 వేలమంది ప్రజలు వారి భౌతికదేహాన్ని ఊరేగింపుగా స్మశానం వద్దకు తీసుకెళ్లి అంత్యక్రియలు జరిపారు.

## తృతీయ ప్రణాళికలో సిద్దేశ్వరం ప్రాజెక్టు

### శిరువెళ్ల తాలూకా రైతు కాంగ్రెసు మహాసభ వినతి

ఆళ్లగడ్డ, మే 29: రాయలసీమలో కరువు శాశ్వతంగా నివారించడానికి సిద్దేశ్వరం ప్రాజెక్టును తృతీయ ప్రణాళికలో చేర్చాలని, కర్నూలుజిల్లాలో అధికవర్షాలవల్ల పంటలు పాడైయినందున పన్నులు, ప్రభుత్వఋణాల వసూళ్లు నిలుపు చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న జరిగిన శిరువెళ్ల తాలూకా రైతు కాంగ్రెసు ప్రతినిధుల సమావేశంలో విజ్ఞప్తి చేశారు. శ్రీ యల్. వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ పేరూరు కొండారెడ్డి స్వాగతమిచ్చారు.

అధ్యక్షులు మాట్లాడుతూ తొలూకాలో అధికవర్షాలవల్ల పంటలు పాడవడమేగాక పండించిన వాణిజ్యపంటలకు ధరలు, ఎగుమతులు, లేక రైతులు ఇబ్బందులు పడుతున్నారని చెప్పారు. అయినా రైతు కూలీలందరు ఐక్యతతో వుంటూ ప్రభుత్వ అభివృద్ధి పనులకు సహకరించాలని కోరారు. భూసంస్కరణలు త్వరలో ప్రవేశపెట్టాలని సూచించారు.

శ్రీ యర్రగుడిదిన్నె జి. తిమ్మారెడ్డి ప్రసంగిస్తూ రైతుపట్ల ప్రకృతితో పాటు ప్రభుత్వం కూడా చిన్నచూపు చూస్తోందని అధికపన్నులవల్ల ఎంతో నష్టపడవలసి వస్తోందని అన్నారు వేరుశెనగ, మిరపపంటల ఎగుమతులపై నిర్బంధాలను నిరసించారు. మద్రాసులోని ఎగుమతుల చీఫ్ కంట్రోలరుతో యీ విషయమై రాష్ట్రప్రభుత్వం సంప్రతించాలని కోరారు.

శ్రీ ఆర్. వి. శేషాద్రి ప్రసంగిస్తూ ప్రభుత్వం తలపెట్టే అభివృద్ధి పథకాలు భగ్నం కాకుండా చూడవలసిన బాధ్యత రైతులపై కలదన్నారు. యువజనుల, రైతుల, సహకారాన్ని సలహాలను ప్రభుత్వం తీసుకుంటూ వుండాలని, అన్ని టినీ ఉద్యోగులకే వదలిపెట్ట రాదని కోరారు. సిద్దేశ్వరం ప్రాజెక్టును తృతీయ ప్రణాళికలోనయినా చేర్చడానికి కృషి చేయాలన్నారు.

సభలో ప్రకాశం పంతులు మృతికి గాఢ సంతాపం ప్రకటిస్తూ ఆళ్లగడ్డ పార్కులో వారి స్మారకచిహ్నం ఏర్పాటు చేసేందుకు ఒక సంఘం ఏర్పరచారు. రాయలసీమలో కరువు శాశ్వత నివారణకు సిద్దేశ్వరం ప్రాజెక్టును తృతీయ ప్రణాళికలో చేర్చాలని విజ్ఞప్తి చేశారు. కర్నూలుజిల్లాలో అధిక వర్షాలవల్ల పంటనష్టం జరిగినందున, పన్నులు, ప్రభుత్వ ఋణాలు వసూళ్ళు వాయిదా వేయాలని కోరుతూ తీర్మానించారు. మిరపపంటను ఎగుమతి చేసేందుకు అనుమతించాలని కోరారు. నాగలమర్రి—మహాదేవపురం మధ్య రోడ్డు నిర్మించాలని అభ్యర్థించారు. ప్రతి తాలూకా కేంద్రంలో అగ్నిమాపక దళం ఏర్పాటుచేయాలని, ఆళ్లగడ్డ ఆస్పత్రిని ప్రభుత్వం నిర్వహించాలని కోరుతూ తీర్మానాలు ఆమోదించారు.

నూతన కార్యవర్గం ఎన్నుకున్నారు: గౌరవ అధ్యక్షులు: శ్రీ సి. పి. తిమ్మారెడ్డి, అధ్యక్షులు: శ్రీ యల్. వి. సుబ్బారెడ్డి, ఉపాధ్యక్షులు: శ్రీ పి. పుల్లారెడ్డి, ప్రధాన కార్యదర్శి: శ్రీ యర్రగుడిదిన్నె తిమ్మారెడ్డి, సహాయ కార్యదర్శి: శ్రీ ఆర్. వి. శేషాద్రి, సభ్యులు: శ్రీయుతులు వి. నాగిరెడ్డి, శ్రీ కె. రంగనాయకులు, శ్రీ బి. వెంకటేశ్వర్లు, శ్రీ పేరూరు కొండారెడ్డి, శ్రీ సోముల చిన్నసుబ్బారెడ్డి, శ్రీ వంకదారి నందీశ్వరయ్య, శ్రీ యల్. వెంకటరెడ్డి, శ్రీ యల్. వెంకటరెడ్డి, శ్రీ వి. సి. సుబ్బారెడ్డి, శ్రీ కె. వెంకటస్వామి, శ్రీ జంబులదిన్నె నాగిరెడ్డి.

## కృష్ణపుష్కరాలలో గోహత్యా నిరోధ ప్రదర్శన

విజయవాడ, మే 30: గోహత్యా నిరోధ సమస్య స్వరూప, స్వభావాలను చిత్రాల ద్వారా, పట్టికల ద్వారా ప్రభుత్వ దృష్టికీ, ప్రజల దృష్టికీ తెచ్చే నిమిత్తం కృష్ణానది పుష్కరాలను పురస్కరించుకుని ఈ పట్టణంలో ఒక ప్రదర్శనను ఏర్పాటు చేస్తారని ఆంధ్ర ప్రదేశ్ గోహత్యా నిరోధ సమితి కార్యదర్శి శ్రీ తూములూరి లక్ష్మీనారాయణ ప్రకటించారు.

రాష్ట్రంలో ఖాళీఅవుతున్న పశువులను వధించే కేంద్రాల పేర్లు, ఆయా చోట్ల రోజుకు ఎన్ని ఆవులు, గేదెలు, గిత్తలు, ఎద్దు చెందలైనవాటిని వధిస్తున్నదీ, మొదలైన వివరాలను తమకు పంపవలసిందని శ్రీ లక్ష్మీనారాయణ గోసంరక్షణ కార్యక్రమాభిమానులకు విజ్ఞప్తిచేశారు.

## రాజమండ్రి పట్టణ వాణిజ్య సంఘం

రాజమండ్రి, మే 29: పట్టణ వాణిజ్య సంఘ సభ్యులు 25 వ తేదీన శ్రీ డి. రామమోహనరావు అధ్యక్షతను సమావేశమై నూతన సంవత్సరానికి దిగువ సభ్యులతో కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. శ్రీయుతులు డి. రామమోహనరావు (అధ్యక్షుడు), వి. సుబ్రహ్మణ్యం, జి. బాపయ్య (ఉపాధ్యక్షులు), కె. ఆత్మారాం (కార్యదర్శి), సంపత్ కుమార్ సింగ్ (సంయుక్త కార్యదర్శి) మరో 23 మంది సభ్యులు.

సమావేశం ఆంధ్రకేసరి మరణానికి సంతాపం ప్రకటించింది.

## సత్కావ్య రచనద్వారా విశ్వశ్రేయస్సు

### కాకరపర్రులో కవి పండితుల సమ్మేళనం

కాకరపర్రు, మే 30: కవిపండితుల సమ్మేళనం యీ నెల 24 న శ్రీ కంది కొండ సీతారామస్వామి అధ్యక్షతన జరిగింది. శ్రీ వేదుల వెంకటశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి, జటి విల్లి పండితుల ప్రతిభా విశేషాలను కొనియాడారు.

శ్రీ గొల్లపల్లి రామమూర్తి తమ సంస్కృత "శంకర కర్ణామృతం" లోని కొన్ని ఘట్టాలు వినిపించారు. శ్రీ మూర్తికవి తమ శ్రీకృష్ణరాయ విజయంలోని పద్యాలు చదివారు. శ్రీ వాసుమంత వఝల జగన్నాథశర్మ తమ ఖండకావ్యంలోని కవితారీతులు తెలిపారు. శ్రీ రెంటాల సుబ్రహ్మణ్యం, శ్రీ శిష్ట్లా వెంకటసుబ్బయ్య, తమతమ రచనల భాగాలు వినిపించారు.

శ్రీ జటావల్లభుల జగన్నాథం సన్నయ భారతాంధ్రీకరణ పద్ధతులు సోదాహరణంగా వివరిస్తూ సత్కావ్యం ద్వారా విశ్వశ్రేయస్సును సాధించాలని చెప్పారు.

శ్రీ చెళ్లపిళ్ల వెంకట సుబ్రహ్మణ్యం కవులను పండితులను శ్రద్ధకు శాలువలతో సత్కరించి వందన సమర్పణచేశారు.

## కర్ల రాజశేషగిరిరావుకు చీరాలలో సన్మానం

చీరాల, మే 30: "ఆంధ్రకీ లోక కథాయే" అనే గ్రంథాన్ని హిందీలో రచించి భారతప్రభుత్వం బహుమానం పొందిన శ్రీ కర్ల రాజశేషగిరిరావుకు 26 వ తేదీన సారస్వత నికేతన గ్రంథాలయ ప్రాంగణంలో సన్మానంజరిగింది.

సభకు హైదరాబాదు హిందీ ప్రచారసభ ప్రధాన మంత్రి శ్రీ గోపాలరావు అపసింగేకర్ అధ్యక్షత వహించారు.

సభా ప్రారంభంలో చిరంజీవులు ఎస్. మల్లేశ్వరరావు, కె. రంగనాయకులు "ప్రచార పరిచయ్" అనే విషయంపై హిందీలోను, చిరంజీవులు కె. సత్యనారాయణ, పి. బలరామిరెడ్డి "సంస్కృతం ప్రతి" అనే విషయంపై సంస్కృతంలోను ప్రసంగించారు. శ్రీయుతులు వి. రామమూర్తి, బి. వి. సుబ్బారావు, జమ్మలమడక మాధవరామశర్మ, కె. కృష్ణసోమయాజులు, భాగవతుల కుటుంబరావు, ఎం. ఉపేంద్రశర్మ, ప్రగడ కోటయ్య ప్రభృతులు పంపిన సందేశాలను శ్రీ డి. కామేశ్వరరావు సభికులకు వినిపించారు.

పిదుపరి శ్రీ కర్ల రాజశేషగిరిరావుకు సారస్వత నికేతనం తరపున నూత్న వస్త్రాలు, పురజనుల తరపున రు. 516 బహూకరించారు. శ్రీ యుతులు జి. వెంకటేశ్వరరావు, రమణారావు ప్రభృతులు సన్మానపత్రాలు, శ్రీ డి. సుబ్బారావు రు. 50 సమర్పించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం హిందీ భాషాధ్యాపకులు శ్రీ జి. సుందరరెడ్డి హిందీ, తెలుగు భాషలకున్న తారతమ్యాలను ఉదాహరణ పూర్వకంగా వివరించారు. శ్రీ పిల్లలమర్రి వెంకట హనుమంతరావు భారతీయ భాషలమధ్య గల పరస్పర సంబంధాలను, సంస్కృతి భాష ప్రాముఖ్యాన్ని తెల్పారు.

శ్రీ శేషగిరిరావు తమకు జరిగిన గౌరవానికి కృతజ్ఞత వెల్లడించి "ఆంధ్రకీ లోక కథయే" రచించటంలో తమ ఆశయాన్ని వివరించారు. సభాధ్యక్షుడు మాట్లాడుతూ దేశ భాషలలో ముఖ్యంగా హిందీ భాషకుగల ప్రాముఖ్యాన్ని తెల్పారు. శ్రీ డి. కామేశ్వరరావు వందన సమర్పణం చేశారు.

## వేటపాలెంలో హిందీ పండితునికి సన్మానం

వేటపాలెం, మే 28: హిందీలో "ఆంధ్రకీ లోకకథాయే" అనే గ్రంథం రచించి భారత ప్రభుత్వ బహుకృతి పందుకున్న సాహిత్యరత్న శ్రీ కర్ల రాజశేషగిరిరావుకు మొన్న పౌరులు సన్మానంచేశారు. శ్రీ గోపాలరావు అపసింగ్‌కర్ అధ్యక్షత వహించారు.

శ్రీ డి. కామేశ్వరరావు అధ్యక్షుని సభికులకు పరిచయంచేశారు. విద్యార్థులకు అధ్యక్షులు యోగ్యతాపత్రాలు పంచిపెట్టారు, పౌరుల తరపున శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావుపంతులు రు. 500, నూతన పట్టువస్త్రాలు బహూకరించారు. రైల్వే ఉద్యోగబృందం నూతన వస్త్రాలు, సన్మానపత్రం సమర్పించారు. తపాల వుద్యోగుల తరపున శ్రీ సి. గోపాలకృష్ణమూర్తి ఒక వెండి గ్లాసును, శ్రీ సుందరేశన్ నూతన వస్త్రాలు బహూకరించారు.

శ్రీ జి. సుందరరెడ్డి మాట్లాడుతూ తెలుగు హిందీ సాహితీరీతులను సమీక్షించారు. గద్యరచనకే నేడు ఎక్కువ ప్రాముఖ్యం లభిస్తోందన్నారు. ఆంధ్రులపేరు నిలిపినందుకు శ్రీ రాజశేషగిరిరావును అభినందించారు. శ్రీ పిల్లలమర్రి వెంకటహనుమంతరావు మాట్లాడుతూ శ్రీ శేషగిరిరావుకు తమతో గల పరిచయం వివరించి సంస్కృతాంధ్రాంగ్లములలో చిన్న వయస్సులోనే వారు సంపాదించిన పాండిత్యానికి అభినందించారు.

శ్రీ శేషగిరిరావు ఉచిత సమాధానమిచ్చారు.

హైదరాబాదు, జూన్ 2: శ్రీకాకుళం, విశాఖపట్టణం, ఉభయగోదావరి కృష్ణా జిల్లాలలో మశూచి వ్యాధి ఉన్నది. వ్యాధినిరోధక కృషి జరుగుతోంది.

## క్రీడారంగం

### ఒంగోలు తాలూకా ఆటల పోటీలు

అమ్మనబ్రోలు, జూన్ 1: ఇక్కడి ఆంధ్ర కల్చరల్ క్లబ్ వార్షికోత్సవాల సందర్భంలో మే నెల 24, 25, 26 తేదీలలో ఒంగోలు తాలూకా ఆటల పోటీలు జరిగినవి. ఆయా పోటీల ఫలితాలు ఈవిధంగా ఉన్నవి:

వాలీబాల్ ఫైనల్స్: గెలుపొందినవారు-ఒంగోలు 'ఏ' జట్టు. రన్నర్స్-ఒంగోలు 'బి' జట్టు.

బాడ్మింటన్ ఫైనల్స్: గెలుపొందినవారు-టంగుటూరి జట్టు. రన్నర్స్-అమ్మనబ్రోలు జట్టు.

చెడుగుడు ఫైనల్స్: గెలుపొందినవారు-ముక్తినూతలపాడు 'ఏ' జట్టు. రన్నర్స్-ముక్తినూతలపాడు 'బి' జట్టు.

ఆఖరిరోజు సాయంకాలం శ్రీ కె. వి. నారాయణరావు అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో సబ్ రెజిస్ట్రార్ శ్రీ డి. యస్. దేవర్ వివిధ పోటీలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టారు. అన్ని ఆటలలో విశేషమైన ప్రావీణ్యం ప్రదర్శించిన కె. వెంకటేశ్వరరావుకు ప్రత్యేక బహుమతి ఇవ్వడమైనది.

దేవరంపాడు గ్రామంలో శ్రీ టి. ప్రకాశంపంతులుగారి స్మారకచిహ్నం నెలకొల్పడానికి బహుమతి ప్రధాన సభలో తీర్మానించడం జరిగినది.

కార్యదర్శి శ్రీ పప్పు ముత్యాలయ్య వందనాలు సమర్పించారు. (స్వ. వి)

### బ్రిటిష్ అమెచ్యూర్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్

లండన్, జూన్ 1: లాంకషైర్ లోని ఫారమ్‌బీలో ఈరోజున బ్రిటిష్ అమెచ్యూర్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ ఫైనల్‌లో ఆర్. జాక్ 2-1 స్కోరుతో హెచ్. రిడ్జిలేను ఓడించారు.

1939లో ఎకెక ఈ ఛాంపియన్‌షిప్ గెలుపొందారు. ఆయన తరువాత బ్రిటిషు అమెచ్యూర్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ గెలుపొందిన మొదటి స్కాట్స్‌మన్ జాక్.

### మైసూరుటెన్నిస్‌ఫైనల్‌లో ఉదయకుమార్ గెలుపు

బెంగుళూరు, జూన్ 2: కబ్బన్ పార్కులోని మైసూరు టెన్నిస్‌సంఘం కోర్టులలో మైసూరు రాష్ట్ర టెన్నిస్ ఛాంపియన్‌షిప్స్ సింగిల్స్ ఫైనల్‌లో నేటి సాయంకాలం వి. జె. ఉదయకుమార్ 6-3, 6-4, 6-4 స్కోరుతో ఎస్. అక్బార్ అలీని ఓడించారు.

జూనియర్ బాలుర సింగిల్స్ ఫైనల్‌లో అబ్బాస్ పాశ 6-0, 6-4 స్కోరులో గోపాలకృష్ణ గుప్తాను ఓడించారు.

### ఫ్రెంచి టెన్నిస్ ఛాంపియన్‌షిప్

పారిస్, జూన్ 2: ఫ్రెంచి అంతర్జాతీయ లాన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్స్ నేడు సమాప్తమైనవి. పురుషుల డబుల్స్ ఫైనల్‌లో ఎ. కూపర్, ఎమ్. అండర్సన్ (ఆస్ట్రేలియా) 6-3, 6-0, 6-3 స్కోరుతో డి. కాండీ, ఎమ్. రోజ్ (ఆస్ట్రేలియా)ను ఓడించారు.

స్త్రీల డబుల్స్ ఫైనల్‌లో కుమారి షర్లీ బ్లూమర్ (బ్రిటన్), కుమారి డార్లీన్ హార్డ్ (అమెరికా సంయుక్త రాష్ట్రాలు) 7-5, 4-6, 7-5, స్కోరుతో కుమారి వై. రామిరెజ్, కుమారి ఆర్. రీస్ (మెక్సికో)లను ఓడించారు.

### అంతర్‌రాష్ట్ర జూనియర్ టూర్నమెంటు

త్రివేండ్రమ్, జూన్ 2: అఖిల భారత అంతర్ రాష్ట్ర జూనియర్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్స్ ఈరోజున ముగిసినవి. వివిధ పోటీలలో గెలుపొందినవారికి కేరళగవర్నరు డా॥ బూర్గుల రామకృష్ణారావు బహుమతులు పంచిపెట్టారు.

బాలుర సింగిల్స్ ఫైనల్‌లో మిత్రా జయసింహాల పోటీ నిన్న ముగియలేదు. ఆ పోటీ తిరిగి ఏర్పాటు చేయలేదు. ఛాంపియన్‌షిప్ ట్రోఫీ ఆ ఇరువురికి కలిపి బహూకరించడమైనది.

### పైడిపాడులో ఆటల పోటీలు

పైడిపాడు, మే 28: ఈ నెల 25, 26, 27 తేదీలలో స్థానిక జాతీయ యువజన సంఘం ఎస్. వి. రామారావు స్మారక ఆటల పోటీలు నిర్వహించినది. ఈ పోటీలలో ఒంగోలు, బాపట్ల తాలూకాలకు చెందినజట్లు పాల్గొన్నవి. ఆయా పోటీల ఫలితాలు ఇలా ఉన్నవి:

బాడ్మింటన్ షటిల్ ఫైనల్: గెలుపొందిన వారు-డి. వసంత వెంకటేశ్వర్లు జట్టు, దుద్దుకూరు రన్నర్స్-జె. అంకమ్మ జట్టు పైడిపాడు.

వాలీబాల్ ఫైనల్: గెలుపొందిన వారు-ఎస్. వి. నూర్యనారాయణ జట్టు, నుద్దిపాడు రన్నర్స్-విక్రం బాపయ్య జట్టు, పైడిపాడు.

చెడుగుడు ఫైనల్: గెలుపొందిన వారు-వి. వెంకటేశ్వర్లు జట్టు ముక్తినూతలపాడు రన్నర్స్-ఎమ్. వి. రామారావు జట్టు, దుద్దుకూరు.

ఆఖరి రోజు సాయంకాలం జరిగిన సభలో శ్రీ బి. కోటయ్య వివిధ పోటీలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టారు. కార్యదర్శి శ్రీ కోడూరి వెంకటేశ్వర్లు వందనాలు సమర్పించారు. (స్వ. వి.)

## ఆకాశవాణి

బుధవారం, జూన్ 5

హైదరాబాద్ (411 మీటర్లు)

ఉ॥ 6-50 సుప్రభాత్, కార్యక్రమ వివరణ 7 తె. వా. 7-15 దత్తాద పాండురంగరాజు (విజయవాడ నుంచి రిలే) 7-45 క. వా. 8 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 సంగమేశ్వరరావు.

మ॥ 12-30 ఘజల్ 12-50 ము. వా. 1 కన్నడమున కార్యక్రమము 1-30 కె. సావిత్రి 1-45 గీతమంజరి 1-50 తె. వా.

సా॥ 5-30 వి. సాంబశివశర్మ 5-45 కర్నాటక సంగీత పాఠం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా. 6-15 కె. ఎస్. గోదామణి 6-30 గ్రామసీమ 7 తె. వా. 7-15 గ్రామసీమ 7-30 లోకభ్రమణము: సమీక్ష (మద్రాసునుంచి రిలే) 7-45 స్పోర్టింగ్ హైదరాబాద్ సమీక్ష—ఎస్. గణేశన్ 7-55 విరామ సంగీతం 8 ఇంటికీ కట్నం మెంత్రా: నాటిక. రచన-పాలంకి వెంకటరామ చంద్రమూర్తి 8-30 ఢిల్లీ వలె 8-50 సుగమ్ సంగీత్ 9 ఆం. వా. 9-15 ఉ. వా. 9-30 టి. కులోచన-వీణ 10 హిందూస్థానీ గానసభ (బొంబాయి నుంచి రిలే) 11 ప్రసార సమాప్తి.

విజయవాడ (357.1 మీటర్లు)

ఉ॥ 6-30 శుభోదయం 6-35 ప్రసార విశేషాలు 6-40 భక్తిరంజని 7 తె. వా. 7-15 దత్తాద పాండురంగరాజు 7-45 సంగీతశిక్షణ 8 ఆం.వా. 8-15 హిం. వా.

మ॥ 1 వాద్య సంగీతం 1-30 గీతమంజరి 1-40 హిం.వా. 1-50 తె.వా. 2 వేణువు:నిలయ విద్వాంసుడు.

సా॥ 5-30 మహంకాళి కృష్ణమూర్తి 6 స్థానిక ప్రకటనలు, వాతావరణము 6-05 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమము 7 తె.వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమము: పురాణ కాలక్షేపం- సి హెచ్. ఎల్. నరసింహాచార్యులు 7-30 లోకభ్రమణము-సమీక్ష (మద్రాసునుంచి రిలే) 7-45 సుగమ్ సంగీత్ 8 ఇంటికీ కట్నం మెంత్రా-నాటిక (హైదరాబాదునుంచి రిలే) 8-30 ఢిల్లీవలె 8-50 వాద్య సంగీతం 9 ఆం.వా. 9-15 దత్తాద పాండురంగరాజు 10 కల్పలత - శ్రోతలు కోరిన పాటలు 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ) (319.1 మీటర్లు)

ఉ॥ 6-50 స్వాగతము, 6-55 నేటి కార్యక్రమ వివరణ, 7 వాద్యసమ్మేళనము, వాతావరణ సూచన, 7-15 త. వా. 7-30 ఆర్. కృష్ణవేణి రాధాకృష్ణన్—వీణ.

మ॥ 12-30 ఆర్. వెంకటరామన్—వయొలిన్, 1 పెణ్ణులగం, 1-30 గీతమంజరి, 1-40 హిం. వా. 1-50 గీతమాలిక, 2 త. వా. 2-10 చిట్టూర్ వి. రామచంద్రన్, 2-40 గోటు వాద్యం—నిలయ విద్వాంసుడు, 2-50 ఆర్. వేదవల్లీ రామస్వామి.

సా॥ 5 పాశ్చాత్య సంగీతము, 5-30 సుగమ్ సంగీత్, 6-05 ప్రాంతీయ సెయిదిగళ్, 6-15 తుళిర్మణం—సంక్షిప్త కథా చిత్రం, 7-15 త. వా. 7-30 జంత్రసమ్మేళనం, 7-45 సముదాయనీతి — తమిళమున ప్రసంగము, 8 పి. ఎస్. నారాయణస్వామి, 8-30 ఎస్. ఎల్. గానసరస్వతి, 9-15 ఎమ్. గోవిందస్వామి నాయుడు — వేణువు, 9-45 పాశ్చాత్య సంగీతం, 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (బి) (211.3, 41.32 మీటర్లు)

ఉ॥ 6-50 మద్రాసు (ఎ) వలె 7 తె. వా. వాతావరణ సూచన 7-15 ఉదయగానము 7-30 మద్రాసు (ఎ) వలె 8 ఆం. వా.

(211.3, 31.28 మీటర్లు)

మ॥ 12 కార్మికుల కార్యక్రమము 12-30 మద్రాసు (ఎ) వలె 1 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 గానమంజరి 1-50 తె. వా. 2 గీతమంజరి 2-10 మద్రాసు (ఎ) వలె.

(211.3, 49.30 మీటర్లు)

సా॥ 5 మద్రాసు (ఎ) వలె 5-30 నాత్తిపట్టు తోళివక్కం: ఉత్సవ ప్రత్రిక-మంగళం పల్లి బాలమురళీకృష్ణ, కోయంబత్తూర్ ఎస్. రామస్వామి - మృదంగం 5-50 స్థానిక ప్రకటనలు, వాతావరణము, వాణిజ్య వార్తలు 6 ఆం. వా, 6-05 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమము 7 తె. వా. 7-30 గ్రామస్థుల కార్యక్రమము: పురాణ కాలక్షేపం—సి హెచ్. ఎల్. నరసింహాచార్యులు. 7-30 లోకభ్రమణము-సమీక్ష వి. వి. నరసింహారావు 7-45 బసవేశ్వర కథన గళు 8 ఇంటికీ కట్నం మెంత్రా. నాటిక (హైదరాబాదునుంచి రిలే) 8-30 ఢిల్లీవలె 8-50 విరామ సంగీతం 9 ఆం. వా. 9-15 మద్రాసులో ఈవారం 9-30 మద్రాసు (ఎ) వలె 9-45 గానలహరి 10-30 ప్రసార సమాప్తి.

## వ్యాయామ విద్యా బోధకులకొకసౌకర్యం

నిడుబ్రోలు, మే 29: ఉన్నతపాఠశాలల్లో 3 సంవత్సరాలు పని చేసిన లోయర్ గ్రేడ్ వ్యాయామ విద్యాబోధకులందరినీ ఉన్నత పాఠశాలల్లో ప్రధాన వ్యాయామ విద్యాబోధకులుగా నియమించవచ్చునని ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది.

ఉన్నతపాఠశాలల్లో అయిదు సంవత్సరాలు పని చేసిన లోయర్ గ్రేడ్ వ్యాయామ విద్యాబోధకులను ఇదివరకు ప్రధాన వ్యాయామ విద్యా బోధకులుగా నియమిస్తూంటే పద్ధతివుండేది. ఇప్పటి ఉత్తరువు ప్రకారం ఉన్నత పాఠశాలల్లో పనిచేసివుండవలసిన కాలాన్ని 3 సంవత్సరాలకు తగ్గించారు. అయితే ఇట్లా పని చేసిన లోయర్ గ్రేడ్ వ్యాయామ విద్యాబోధకులను ప్రధాన వ్యాయామ విద్యాబోధకులుగా నియమించేముందు రెండు నెలల స్వల్పకాలికశిక్షణ ఇస్తారు. విడవకుండా రెండు సంవత్సరాలు ఉన్నత పాఠశాలలో వ్యాయామ విద్యాబోధకులుగా పనిచేసిన లోయర్ గ్రేడ్ వ్యాయామ విద్యా శిక్షకులను 3-వసంవత్సరంకూడా అదే ఉద్యోగంలో పని చేయనివ్వాలి; మూడవ సంవత్సరం ప్రారంభంలో ఇటువంటి అధ్యాపకులను తొలగించి, వారికి బదులు కొత్తవారిని నియమించరాదు. ఈ సంవత్సరం వేసవి సెలవులకు ముందు ఆయా విద్యాసంస్థలు తొలగించిన వ్యాయామ విద్యాశిక్షకులలో రెండు సంవత్సరాలు విడవకుండా పనిచేసినవారు ఉద్యోగంలో ఉన్నట్టే పరిగణించాలని ఈ ఉత్తరువు వివరిస్తున్నది.

ఈ వేసవి సెలవులముందు 34 మంది లోయర్ గ్రేడ్ వ్యాయామ విద్యాశిక్షకులను గుంటూరు జిల్లాబోర్డు తొలగించి వారికి బదులు హయ్యర్ గ్రేడ్ వ్యాయామ విద్యాశిక్షకులను నియమించాలని నిర్ణయించింది. దానిమీదట ఆందోళన జరుగగా ప్రభుత్వం ఇప్పుడు పైన వివరించిన ఉత్తరువును జారీచేసింది.

## ఆంధ్రదేశం మార్కెట్లలో ధరలు

ఆదోని, జూన్ 1: గత మే 16 వ తేదీతో అంతమైన వారంలో యీ క్రింది ఊర్లలోని మార్కెట్లలో ధరల ధోరణి యీ విధంగా ఉండెనవి.

ఆదోని:-కపాస్ 392 పౌనులు. ముంగారి రు 130 నుంచి 134. ఫారం రూ 135 నుంచి 139-120. లక్ష్మి రు 172 నుంచి 188.

దూది 392 పౌనులు - ముంగారి రూ 245 నుంచి 275 ఫారం 378 నుంచి 390 లక్ష్మి 385 నుంచి 420.

ప్రత్తిగింజలు రూపాయకు అన్ని పౌనుల చొప్పున ధర. ముంగారి-ఫారం 8 పౌనులు. లక్ష్మి 10½ పౌనులు. వేరుసెనగ 28 పౌనుల మనుగు సీసట్సు రూ 6-13-0 నుంచి 6-14-0 కోరమండల్ 6-12-0 నుంచి 6-13-0 వేరుసెనగపప్పు 531 పౌనుల భారువ రూ 165 నుంచి 168.

ఆదోని మార్కెటులోకి కపాస్ 1862 డోక్రాలు దూది 10858 డోక్రాలు. వేరుసెనగ 14170 బస్తాలు

నంద్యాల:—కపాస్ 1680 పౌనుల పుంటం. ఉమ్రి రూ 580 నుంచి 609 రెడ్ నార్తరన్సు 550 నుంచి 570. తెల్లని నార్తరన్సు 570 నుంచి 580. యస్—14.615 నుంచి 620. లక్ష్మీ ఫారం 620 నుంచి 680.

దూది 784 పౌనుల పుంటం ఉమ్రి రూ 845. రెండ్ నార్తరన్సు 800 తెల్లని నార్తరన్సు రూ 825. యస్ 14 రూ 868. లక్ష్మీఫారం.

ప్రత్తిగింజలు 1200 పౌనుల పుంట్లు ఉమ్రి రూ 160 రెడ్ నార్తరన్సు రూ 178 తెల్లని నార్తరన్సు రూ 175 యస్. 14 రూ 180 లక్ష్మీఫారం 130.

వేరుసెనగ 28 పౌనులు రూ 6-5-4 నుంచి రూ 6-6-8. వేరుసెనగ పప్పు 513 పౌనులు భారువ రూ 165 నుంచి 170.

నంద్యాల మార్కెటులోకి ఉమ్రి 10 పుంట్లూలు రెడ్ నార్తరన్సు 18 పుంట్లూలు తెల్లని నార్తరన్సు 29 పుంట్లూలు యస్. 14 రకం 99 పుంట్లూలు లక్ష్మీఫారం 9 పుంట్లూలు. దూది 5276 బస్తాలు వచ్చాయి. ఇక్కడ నుంచి 169 పేళ్లు ప్రత్తి ఎగుమతి అయినయి.

ఎమ్మిగనూరు: వేరుసెనగ 28 పౌనులు కె. జి. రూ. 6-11-0 నుంచి రూ. 6-12-6 ఏ. యస్. టి. రూ. 6-10-0 నుంచి 6-11-6 ఈ మార్కెటుకు 2664 బస్తాల వేరుసెనగ వచ్చాయి.

కర్నూలు: వేరుసెనగ 28 పౌనులు రూ 6 నుంచి 6-9-0. వేరుసెనగ గింజలు 531 పౌనులు భారువ రూ 166 నుంచి 168-కర్నూలు మార్కెటుకు కపాస్ 35 డోక్రాలు, వేరుసెనగ 36555 బస్తాలు వచ్చాయి.

## మదరాసు ధరలు

మదరాసు, జూన్ 3:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవనుకు 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 72.25
సేట్లాబంగారం తులం రు. 109.25
మూసా బంగారం తులం రు. 108.00
సీమవెండి తులం 100 కి రెడి 187.12
చిల్లర ధర రు. 1.90

### వేరుశనగ

(551 పా॥ 1-కి ఎక్సుపోస్టు సిద్ధం రులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా
డిసెంబరు రు. 156-160

వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ టిన్ % పా.) రెడి చిల్లర ధర 330.00
50 టెంకాయనూనె (37½ పౌనులు సేల్సుటాక్సు అదనం,
అంబుమార్కు రు. 30.00
ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 31.00
రాజా రు. 30.50

### ఆముదం

తిరుపత్తూరు (500 పా.) రు. 360

### పంచదార

సేలం సౌత్ ... (37½ పా) 28.00
ప్యారిస్ (2 అందరు) 102.68-103.23

## క్రొత్త పన్నులను రద్దుపరచాలి

### సత్తెనపల్లి జనసంఘ సభ్యుల వినతి

సత్తెనపల్లి, మే 27 : కేంద్రప్రభుత్వం క్రొత్తగా విధించిన పన్నులవల్ల బీద ప్రజలు చాలా బాధపడవలసి వుంటుంది కాబట్టి వాటిని రద్దుపరచాలనీ, చౌక విక్రయశాలలద్వారా తక్కువ ధరలకు బియ్యం అమ్మించాలనీ పట్టణ జనసంఘం అధ్వర్యాన నిన్న సాయంత్రం జరిగిన బహిరంగసభలో విజ్ఞప్తి చేశారు.

సభకు శ్రీ శిఖాకోలను మల్లిఖార్జునరావు అధ్యక్షత వహించారు. జిల్లా జనసంఘ కార్యదర్శి శ్రీ కె. వెంకటేశ్వర్లు శ్రీయుతులు ఎస్. హరిహరరావు, బి. రవీంద్రనాథ్ ప్రభృతులు ప్రభుత్వ పన్నువిధానాన్ని, ఆర్థిక విధానాన్ని తీవ్రంగా విమర్శించి, ప్రణాళికను విజయవంతంగానిర్వహించగలడానికి కొన్ని మార్పులను చేయటంతో పాటు అనవసరపు ఖర్చులను తగ్గించుకోవాలని సూచించారు.

సభా ప్రారంభానికి ముందు పట్టణ జనసంఘ కార్యదర్శి శ్రీ డి. నాగేశ్వరరావు నాయకత్వాన పురజనులు ఊరేగింపుగా తహశీల్దారు కార్యాలయానికి వెళ్లి చౌక విక్రయశాలలు ఏర్పాటు చేయించాలని కోరుతూ వినతిపత్రం మీద వెయ్యిమంది ప్రజలు సంతకాలు చేశారు.

### కేంద్రప్రభుత్వం విధించిన క్రొత్త పన్నులు

#### పెద్దాపురం పి. ఎస్. పి. కార్యకర్తల వినతి

పెద్దాపురం, మే 29 : కేంద్రప్రభుత్వం క్రొత్తగా విధించిన పన్నులు బీద ...

## కేవలం శాసనాలవల్ల ప్రయోజనం లేదు

### అనకాపల్లిలో జయప్రకాశ్ వివరణ

అనకాపల్లి, మే 30 : "ప్రజల హృదయాలలో పరివర్తనం కలగందే ప్రభుత్వం ఎన్ని శాసనాలు చేసినా ప్రయోజనం ఉండదు. గాంధీజీ ఈ విషయాన్ని గ్రహించి రష్యా, అమెరికా దేశాలలోని విప్లవ నాయకులవలె అధికారం చేపట్టకుండా, ప్రజల హృదయాలను మార్చటానికి ప్రయత్నించారు. భూదాన ఉద్యమాన్ని ప్రారంభించి వినోబాజీ మహాత్ముని ఆదర్శాన్నే అమలు జరుపుతున్నారు." అని భారత ప్రజా సోషలిస్టు పక్షనాయకుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ నిన్న సాయంత్రం భూదాన ఉద్యమ ప్రచారంకోసం ఇక్కడ జరిగిన బహిరంగసభలో అన్నారు.

సభకు శ్రీ ప్రభాకర్‌జీ అధ్యక్షత వహించారు. శ్రీ నారాయణ దాదాపు రెండుగంటలసేపు హిందీలో ప్రసంగించారు. శ్రీ గోపరాజులవణం ఆయన ప్రసంగాన్ని తెలుగులోకి అనువదించి చెప్పారు.

శ్రీ జయప్రకాశ్ ఇలా అన్నారు. "దేశంలో నూటికి పదిమంది ఉన్నవాళ్లు, తొంభైమంది లేనివాళ్లు ఉన్నారు. ఈ రెండుతెగల వారి మధ్య సంఘర్షణ సాగుతోంది. సంఘర్షణ మితిమీరి లోక వినాశనానికి దారితీసే మహాయుద్ధం సంభవించే ప్రమాదం కూడా లేకపోలేదు. ఈ పరిస్థితిని అధిగమించి పోవాలంటేవ్యక్తులకు "ఇది నాది" "అది నీది" అనే భావాలుపోవాలి. ఎక్కువగా భూమి, ధనం ఉన్నవారు ఈ సంపదంతా తమ సొంతంకాదని అనుకోవాలి."

## మరో వేతన నిర్ణాయక సంఘాన్ని నియమించాలి

### హైదరాబాదు తపాలాపనివారి సంఘంవిజ్ఞప్తి

హైదరాబాదు, మే 31: హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలను 'ఎ' తరగతి పట్టణాలుగా గుర్తించవలసిదిగా ప్రభుత్వానికి అఖిలభారత తంతి తపాలా పనివారిసంఘం హైదరాబాదుశాఖ మంగళవారం జరిగిన సమావేశంలో విజ్ఞప్తిచేసింది. సమావేశానికి శ్రీ ఎన్. సత్యనారాయణరెడ్డి అధ్యక్షత వహించారు.

తపాలా పనివారి కోరికలను సాధించేందుకు దేశవ్యాప్తంగా సమ్మెచేయాలని జాతీయ కార్యవర్గం చేసిన తీర్మానాన్ని ఈ సమావేశంలో బలపరిచారు.

వేతనాలను నిర్ణయించేందుకు మరొక విచారణసంఘాన్ని నియమించవలసినదిగా కోరారు. కేంద్ర వేతన నిర్ణయాక సంఘం సిఫార్సుల ప్రకారం కరువుభత్యాన్ని ఎక్కువ చేయవలసినదిగా కోరారు. శాఖలవ్యాలనుఏర్పాటు చేసే సందర్భంలో 3వ తరగతి ఉద్యోగులూ నాలుగవ తరగతి ఉద్యోగుల మధ్య విభేదాలనూ, తంతి తపాలాశాఖ ఉద్యోగులూ ఇతర కేంద్రప్రభుత్వ ఉద్యోగులకూ మధ్యగల విభేదాలనూ ...

### శీతజ్వరంవల్ల మరణాలు

#### బొంబాయిలో 14 గురు కలకత్తాలో నలుగురు

బొంబాయి, జూన్ 2: ఈ రోజు బొంబాయిలో మరోఐదుగురూ, కలకత్తాలో 4 గురు శీతజ్వరంవల్ల మరణించారు. వీరితో ఇంతవరకూ బొంబాయిలో మొత్తం 14 మందిమరణించారన్నమాట.

బొంబాయిలో ప్రతిదినమూ ఇరవైవేలమంది రోగులు శీతజ్వరానికి చికిత్స పొందుతున్నారు. ఈ వ్యాధి నివారణకు బొంబాయి కార్పొరేషను రోజుకు సగటున ఏభైవేలరూపాయలు ఖర్చు చేస్తోంది. ఈ వ్యాధి సోకకుండా టీకాలువేసే మందును తయారుచేయడాన్ని గురించి ప్రభుత్వం పరిశీలిస్తోంది. నగరంలోని ప్రభుత్వ వైద్యాలయాలన్నిటిలోనూ ఎ. పి. సి. మాత్రలను సరఫరా చేయడానికి కూడా ...

#### బొంబాయిలో 14 గురు

### డిల్లీలో జ్వరం

### డెక్ ప్రయాణీకులువినా "రజులా" ప్రయాణం

### హైదరాబాదులో శీతజ్వరం

### నగరంలో శీతజ్వరం తగ్గుముఖం పట్టిందని ఆరోగ్యాధికారుల భావన

### నెల్లూరు డివిజన్ తపాలా సిబ్బంది సమావేశం

### సింహళ మంత్రులపై ప్రజల దౌర్జన్యం

#### రాళ్ల దెబ్బలవల్ల ఒకరికి గాయాలు

### జంట నగరాల తపాల సిబ్బంది

### ఆంధ్రరత్న జయంతి

### విజయవాడలో అన్నదానం

### కామవరపు కోటలో తంతి సౌకర్యాలు

### దొంగ సారా నేరాలు: నలుగురి అరెస్టు

### జూలకల్లులో అదనపు పోలీసు బలగం

### "స్వతంత్ర సభ్యుడిగా వ్యవహరిస్తాను"

#### ప్రొద్దుటూరు నియోజకవర్గ శాసనసభ్యుని ప్రకటన

### వీరవల్లితాలూకా పంచాయతీ అధ్యక్షుల కార్యవర్గం

### పెదమునేలి పంచాయతీ

### దక్షిణఇండియా పత్రికా రచయితల ఫెడరేషన్

## నేటిరాష్ట్రపతిలాగే పూర్వం రాజులు

### వైదికపరిపాలన: ఆచార్య ప్రియవ్రతాజీ వివరణ

హైదరాబాదు, జూన్ 1: "వైదిక పరిపాలనాపద్ధతి ప్రకారం రాజరికం, ఎప్పుడూ వంశపారంపర్యంగా రాలేదు. ప్రజలు ఎన్నుకొన్నవారే రాజుగా ఉండేవారు. ప్రస్తుతం రాష్ట్రపతి ఎలాగో అప్పట్లో రాజుఅలాగు" అని హరిద్వారంలోని గురుకుల విద్యాలయం ఉపాధ్యాయులు ఆచార్య ప్రియవ్రతాజీ ఆర్యప్రతినిధిసభ అధ్వర్యాన, సుల్తాన్ బాగ్‌లో జరుగుతున్న వైదిక వర్ణాశ్రమ రాజనైతిక సాధన శిబిరంలో "వేదాలు వైదిక పరిపాలనా పద్ధతి" అన్న విషయంపై ప్రసంగిస్తూ చెప్పారు.

"ప్రజలచేత ఎన్నికైనరాజు నాన ప్రస్తాశ్రమం స్వీకరించేవరకు పరిపాలించేవాడు. అతనికి ప్రభుత్వనిర్వహణలో తోడ్పడడానికి మనోజనపద్ధతి పై ...

### "మోసం మానవుని నైజం కాదు"

#### పండిత ఈశ్వరచంద్రజీ అభిప్రాయం

### 3డేళ్లలో గిరిజనులకు రు 25 కోట్ల ఖర్చు

(1వ పుట తరువాయి)

### శ్రీదర్భా వెంకటనరసరామ దాసు స్మృతి

## భద్రాచలంవద్ద రేవు దాటింపు కంట్రాక్టు రద్దు

### పడవ ప్రమాదం పర్యవసానంగా తిరిగి వేలంవేయ నిర్ణయం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

భద్రాచలం, జూన్ 2: భద్రాచలం వద్ద రేవుదాటింపు పడవలు నడపడానికి లోగడ శ్రీ కనపాని అప్పారావుకు ఇచ్చిన కంట్రాక్టు తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు, ఏజెన్సీ జిల్లాబోర్డు అధ్యక్షుడు అయిన శ్రీ ఎ. కృష్ణమూర్తి రద్దుచేశారు. ఈ రేవుదాటింపు హక్కు తిరిగి వేలం వేయడానికికూడా జిల్లా కలెక్టరు ఏర్పాటు చేశారు.

ఏప్రిల్ నెల 10 వ తేదిని సంభవించిన పడవప్రమాదం పర్యవసానంగా కలెక్టరు ...

### ఒరిస్సా ఆయవ్యయ అంచనాలు

#### 3 కోట్లుపైగా లోటు! 170లక్షలకు కొత్తపన్నులు

భువనేశ్వర్, జూన్ 3:— 1957—58 సంవత్సరానికి ఒరిస్సా ప్రభుత్వ ఆదాయంలో 81755000 లోటువస్తుందని అంచనా. కొత్తపన్నుల ద్వారా 170 లక్షలు, ... రాబడి ... రాబడి అంచనా 218948000, ఖర్చు అంచనా 25,07,08,000.

## మద్రాసు సాగరజలంలో ఆంధ్రకేసరి అస్థి నిమజ్జనం

### నగరంలో స్మారకచిహ్నం నెలకొల్పేందుకు ప్రయత్నం

## మద్రాసు మార్కెటు

### వేరుసెనగనూనె ధరలో మాంద్యం

మద్రాసు, జూన్ 2: దక్షిణార్కాడు కేంద్రాలలో వేరుసెనగ వేసవిపంట యింకా వస్తూ ఉంది. కొన్ని వారాల వరకు విశేషంగా యీ సరుకురావచ్చు. ఈప్రాంతంలో వేసవిలోపడే వర్షాలు యింకా సంభవించనందున యీసాలు పంట మామూలుకన్నా తక్కువగా నుండవచ్చునని భయపడుతున్నారు. పాల్లాచి, ఉడమాల్‌పేట తాలూకాలలో వేరుసెనగపంటకు తెగులు పట్టినందున పంట దిగుబడికి కొంత భంగపాటు కలుగవచ్చును.

మద్రాసులో వేరుసెనగ ధర బారువ 1 కి మేలిరకం రూ 168 నుంచి 160 వరకు, రెండవరకం రూ 158 నుంచి 156 కు తగ్గింది. ఈ మార్కెటుకు రోజూ 500 బస్తాల సరుకు వచ్చాయి. చిన్న మర పరిశ్రమదార్లు చాలా వరకు యీ సరుకు కొన్నారు.

బొంబాయినుంచి వ్యాపార గిరాకి విశేషంగా తగలక పోవడం వల్లను వేసవి పంట రావడం చేతను నూనె ధరలు మందగించాయి. కలకత్తా వ్యాపారస్థులు రెడీ నూనె స్వల్పవ్యవధి వాయిదాల సరుకు మాత్రం కొంటూ వచ్చారు. రెడీ నూనె బారువ 1 కి రూ 840 నుంచి 880 వరకు వాయిదా సరుకు ధరలు జూన్ వాయిదా సరుకు రూ 9 జూలై వాయిదా సరుకు రూ 11 నుంచి 12 వరకు తగ్గినవి. జూలై వాయిదా సరుకు కొంతవరకు అమ్మకం జరిగింది.

### తోళ్ల వ్యాపారం

[7 వ కాలం చూడుడు]

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ జ్యేష్ఠ శు॥ సప్తమి 1957 సం॥ జూన్ 4 మంగళవారం శు॥ సప్తమి రా 1-48 మఘ 23-34 వర్జ్యం 12-22 ల 13-52 కు.

శు॥ అష్టమి జూన్ 5 బుధవారం శు॥ అష్టమి 23-34 పూ॥ఫ 22-7 వర్జ్యం 7-5 ల 8-35 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులే యవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్
(మహాభారతము)

హేమలంబ సం॥ జ్యేష్ఠ శు॥ సప్తమి
మంగళవారం


## ఆహార సమస్య

ఆహార ధాన్యముల పంట అధికమైనా, ఆహారసమస్య మాత్రం పరిష్కారం కాలేదు. కొన్ని ప్రాంతాల్లో ఆహార ధాన్యాల కొరత ఆందోళన కరంగాకూడా వున్నది. ధాన్యం నిల్వను స్వాధీనం చేసుకొన డానికి వీలుగా కేంద్రప్రభుత్వం క్రిందటివారమే అవసరవస్తువుల చట్టాన్ని సవరించింది. ఈ విధంగా స్వాధీనం చేసుకున్న ధాన్యానికి న్యాయమైన ధర చెల్లించగలమని కేంద్ర ఆహార శాఖామంత్రి హామీ ఇచ్చారు. పంట వృద్ధిఅయినా మొత్తం మీద ఆహారపరిస్థితి అంత తృప్తికరంగా లేదని అధికారులు కూడా అంగీకరించారు.

అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశంలో కూడా ఆహార సమస్యపై చర్చజరిగింది. ఆహారసమస్యా పరిష్కారానికి 18 అంశాల కార్యక్రమాన్ని సమావేశం సూచించినది. కార్యక్రమంలో భూసంస్కరణ లకు ప్రథమస్థానం ఇచ్చారు. దాదాపు పది సంవత్సరాలుగా ఈ భూసంస్కరణలను గురించి అధికారస్థాయిలోనూ అనధి కార వర్గాల్లోనూ చర్చలు సాగుతూవున్నవి. ప్రణాళికా సంఘంకూడా ఈ సంస్కరణ లకు సంబంధించిన కొన్ని సూచనలను చేసింది. ఇంత వరకూ సమగ్రమైన భూసంస్కరణల శాసనం తయారుకాలేదు. కాని భూసంస్కరణలను గురించి అధికారస్థాయిలో జరుగుతూ వున్న చర్చలవల్ల వ్యవసాయ రంగంలో ఒక అనిశ్చయపరిస్థితి ఏర్పడి సేద్యం కొంత దెబ్బ తిన్నది. భూస్వాములకు కౌలు దార్లకు కూడా శ్రద్ధ, ఆసక్తి కొంత తగ్గడంవల్ల ఎక్కువ భూమి సాగులోకివచ్చినా జలా ధారాలు వృద్ధి అయినా, వీటికి తగ్గట్టు ఉత్పత్తి పెరగలేదు. రాష్ట్ర కేంద్రప్రభుత్వాలుగాని, అఖిలభారత కాంగ్రెసు సంఘం గాని వ్యవసాయ రంగంలోని యథార్థ పరిస్థితులను గ్రహించి ఉత్పత్తి పెరుగుదలకు గల యథార్థమైన అవరోధాలను తొలగించడానికి తగిన కార్య క్రమాన్ని నిర్ణయించలేదు.

అఖిల భారత కాంగ్రెసు సంఘం ఆమోదించిన 18 అంశాల ప్రణాళికలో క్రొత్త విష యాలు ఏమీ లేవు. అయినా ఈ కార్యక్రమంలోని అన్ని అంశాలనూ రాష్ట్రప్రభు త్వాలు పూర్తిగా అమలు జరి పితే ఆహార సమస్య చాలా వరకు పరిష్కారము కావ చ్చును. వ్యవసాయ రంగంలో ఏర్పడిన అనిశ్చయ పరిస్థితి కూడా చాలావరకు తొలగిపో గలదు. భూసంస్కరణల విష యంలో రాష్ట్రప్రభుత్వ విధా నాలు ముందు స్పష్టం కావాలి. తాత్కాలికావసరాలను బట్టి, సద్యఃఫలితాలను సాధించా లనే సంకల్పంతో చేసే శాస నాలవల్ల నష్టమే ఎక్కువగా వుంటున్నది.

రైతుల రక్షణకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు చేసిన శాస నాలలక్ష్యం, ఆశాసనాలు అమలు జరపడంలో కన్పించదు. సస్యాభి వృద్ధికి కేంద్ర, రాష్ట్ర ప్రభు త్వాలు ఎన్నో కార్యక్రమా లను అమలు చేసినవి. అయితే ఆ కార్యక్రమాలవల్ల వ్యవ సాయదారులు అంతగా లాభించ లేదు. ఈ పరిస్థితులపై సమ గ్రమైన విచారణ జరిపి ప్రభు త్వానికీ, పంటదారులకూ ఇప్పటికంటే ఎక్కువ సన్నిహిత సంబంధాలు ఏర్పడేటట్లు చూడాలి. పంటదారులు వారి ధాన్యాన్ని ప్రభుత్వ ధాన్యా గారాలకు చేర్చి వెంటనే ఖరీ దును పొందడానికి ప్రభుత్వం తగిన ఏర్పాట్లు చేయకలిగితే, లాభాల కొరకు వ్యాపారస్తులు ధాన్యాన్ని నిల్వచేసే అవకాశం లేకుండా పోతుంది. ఈ కార్య క్రమాన్ని ముందు మిగులు రాష్ట్రాల్లో ప్రారంభింప వచ్చును.

## నేపాల్‌లో కమ్యూనిస్టుల పోటీప్రభుత్వం

### ప్రధాని వివరణ

ఖాట్మండు, జూన్ 2: దక్షిణ నేపాల్‌లో అల్లరిమూకలు కొంతమంది క్రిందటినెలలో కొంతకాలంపాటు పోటీ ప్రభుత్వాన్ని నెలకొల్పారనీ, వీరికి కమ్యూనిస్టులతో ప్పాటువున్నట్లు ఉందని నమ్మకంగా తెలిసిందనీ, నేపాల్‌లో ఒక తెలంగాణాను సృష్టిం చాలని వీరు యత్నించారనీ నేపాల్ ప్రధాని శ్రీ టంకప్రసాద్ ఆచార్య తెలి పారు. ఐతే ప్రస్తుతం పరిస్థితి అంతా అదుపులోనికి వచ్చిందనీ, ప్రభుత్వసైని కులు జల్ని 30 మందిని అరెస్టు చేయ డంతో ప్రజాపోలీసుదళాలు మాయమై పోయాయనీ అన్నారు.

## కాలువ నీటి సరఫరా కట్టివేస్తే...

### భారత్‌తో పోరాడతామని సురావర్దీ ప్రకటన

కరాచీ, జూన్ 2: కాలువ నీటి సర ఫరాను భారతదేశం కట్టివేస్తే, తాము దెబ్బలాడగలమని పాకిస్తాన్ ప్రధాని సురావర్దీ అమెరికా వార్తా సంస్థ ప్రతి నిధితో అన్నారని పాకిస్తాన్ పత్రికలు ప్రచురించాయి. తాము దెబ్బలాడడం కన్నా నీటి సరఫరాను నిలిపివేయడం అధిక దురాక్రమణ కాగలదన్నారు. భారతదేశం పాకిస్తాన్‌ను ఏమైనాచేయ దలిస్తే రెండు మార్గాలున్నాయి. కాశ్మీరు, కాలువనీరు భారతదేశం డాములను నిర్మించుకొని పశ్చిమ పాకి స్తాన్‌కు నీటి సరఫరాను త్రెంచివేయా లని చూస్తోంది. బహుశా ఈ పని వచ్చే సంవత్సరం జరగవచ్చు. కాశ్మీర్ నుండి ప్రవహించే నదులనీటిని కూడా భారతదేశం అడ్డగించవచ్చు. ఎప్పుడు సాగుచేయని రాజపుటానా ఎడారిని సాగుచేయడానికి నీరుకావాలని భారత దేశం అంటోంది.

ఈవిధంగావచ్చే తేడాను కాశ్మీర్‌కు బయట ప్రవహించే మూడునదుల నీటిని పాకిస్తాన్ ఉపయోగించుకొనడంవల్ల సర్దుబాటు చేసికోవచ్చు నంటున్నారు. ఈ నదులలోని నీటిని ఉపయోగించు కోవాలంటే కోటాది డబ్బుఖర్చుచేసి డాములనూ కాలవలను ఏర్పాటుచేసి కోవాలి. ఇందుకు భారతదేశం సహాయం చేస్తుందనుకోవడం లేదు. ఐతే ఈ కాలువనీటిసరఫరా విషయంలో భారతదేశం పై ఎలాంటి ఒత్తిడీ తీసికొని రాలేం. భారతదేశం ఎంతశక్తివంతంగా ఉందంటే, ప్రతివారూ ఆదేశాన్ని మంచిచేసికోవాలనే చూస్తున్నారు. చివరకు అమెరికా కూడా అలాగే వ్యవహరిస్తోంది అన్నారు.

రేపు ఇక్కడ జరిగే బాగ్దాద్ కూటమి మంత్రిమండలి సమావేశాన్ని సురావర్దీ ప్రారంభిస్తారు. ఈరోజు మాత్రం ఆయనకు కొద్దిగా జ్వరం వచ్చి నందువల్ల, విశ్రాంతి తీసికోమని వైద్యులు సలహా ఇచ్చారు. ఐతే, ఆయన ఆరోగ్యం విషయమై ఆందోళన చెంద వలసిన అవసరం లేదని పాకిస్తాన్ రేడియో ప్రకటించింది.

# మంత్రుల కిచ్చే జీతాలు ఏమంత ఎక్కువ కావు

## స్వవిషయం ఉదహరిస్తూ కాంగ్రెస్ సంఘంలో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, జూన్ 2: కేంద్రమంత్రులు, వివిధ రాష్ట్రాల మంత్రులు పుచ్చుకొంటున్న జీతాలు, ఏమంత ఎక్కువ కాదని చెప్పటానికి ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ, తనకు నెల నెలా ఎంతజీతం చేతికివస్తున్నది, ఎలా ఖర్చు అవుతున్నదీ, ఇవాళ అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశంలో వివ రించారు.

కరాచీ కాంగ్రెసులో, నెలకు రు. 500/ల కన్నా ఎక్కువ జీతం ఉండరాదని నిర్ణయించినా, యిప్పటి పరిస్థితు లకు పోల్చిచూచితే, ఆ మొత్తం విలువ యిప్పటి 2 వేలకు పైగానే ఉంటుందని శ్రీ నెహ్రూ అన్నారు.

పదవిలో ఉన్న కాంగ్రెసువా రెవరూ నెలకు 1000/-కు మించి జీతం తీసుకోరాదంటూ, యివాళ అఖిల భారత కాంగ్రెసు సంఘసమావేశంలో ఒకరు ప్రతిపాదించిన అనధికార తీర్మా నంపై ప్రధానమంత్రి నెహ్రూ కల్పిం చుకొని మాట్లాడుతూ, ఇప్పుడుమంత్రు లకిచ్చే జీతాలు-వారు కట్టవలసిన రాబడి పన్ను మినహాయిస్తే-యీ తీర్మానంలో సూచించిన రు 1000/-లకు ఏమంత మించిఉండవని అన్నారు.

"నా మటుకు నాకు నెల నెల నిక రంగా రు 1600/-లు మాత్రం చేతికి వస్తుంది. నా పుస్తకాలమీద రాయల్టీ రూపంలో డబ్బు రాకపోతే, సర్దుకో వడం కష్టమయ్యేదే."

"ఈ సంగతులన్నీ మీకు స్పష్టం చేశాను. ఇక మీరు మీ యిష్టంవచ్చిన నిర్ణయం చేయవచ్చు"అని శ్రీ నెహ్రూ చెప్పారు.

### 'నా జీతం ఎంతో నాకే తెలియదు'

తనజీతం, ఖర్చు వివరిస్తూ నెహ్రూ యీ సంగతులు చెప్పారు.

"నా జీతం సరిగా ఎంతో నాకు తెలియదు. కాని రాబడిపన్ను మినహా యించగా నా చేతికి నెల నెలా రు 1600 లు వస్తుంది. అలహాబాదులో నాకు పిత్రార్జితమైన ఇల్లుఒకటియున్నది. అప్పుడప్పుడు నేను, నా కుమార్తె అక్కడికివెళ్లి ఉంటూ ఉంటాము. మా నాయన కాలంనుంచి, ఆ యింట్లో తోటమాలి మొదలైన కొందరు ఉంటు న్నారు.వాళ్ళందర్నీ ఉద్యోగాలనుంచి తీసివేయడం నాకిష్టంలేదు. ఇందువల్ల నాకు నెలకు రు 900 ఖర్చవుతుంది. పోతే ఇకమిగిలే రు700ల లోనూ రు 200 కాంగ్రెసు సంఘాలకు,తదితరసంస్థలకు సభ్యత్వం చందాగా చెల్లిస్తున్నాను. ఇక, నా సొంతానికి రు. 500 మిగులు తుంది. నిజానికి నా సొంతఖర్చులకు- పళ్లతోముకునేపేస్టు, బ్లేడులు యిత్యాది స్వల్పమైనవేఅయినా-యీ డబ్బు చాలదు.

"ఢిల్లీలో నేనిప్పుడు నివసిస్తున్న భవనం, రాష్ట్రపతి ప్రాసాదంలో ఒక భాగమే. దీనికి బాడుగ ఏమీ లేదు అయినా అది ఒక హోటలులాంటిది. తిండికి అయ్యేఖర్చు చెల్లించాలని రాష్ట్రపతి ఎస్టేట్ నుంచి నాకు బిల్లు వస్తుంటుంది. అతిథి సత్కార ఖర్చులు మాత్రం ప్రభుత్వమే భరిస్తుంటుంది. నాకు, నా కుమార్తెకు, ఎవరైనా మా సొంత అతిథులువస్తే వారికి అయ్యే ఖర్చులు నేనే చెల్లించుకోవాలి."

### అతిథిమర్యాదలకు ఖర్చు

రాష్ట్రాల్లో మంత్రుల జీతాల విషయం చెబుతూ, శ్రీ నెహ్రూ యిలా అన్నారు.

"రాష్ట్రాల్లో మంత్రులకు నెలకు రు. 750 లగాయతు రు. 1500 దాకా వస్తుంది. అద్దె లేకుండా ఒక ఇల్లు, వాడుకోడానికి ఉచితంగా ఒక కారు ప్రభుత్వం ఇస్తుంది. ఈ జీతాలతో భోగలాలసమైన జీవితం గడపవచ్చునని, ఎవరూ అనుకోలేరు. వ్యాపారస్థులు, పెట్టుబడిదారులుతప్ప, మా మూలు వాళ్ళెవరు కారు కొనుక్కోలేరు. కేంద్రమంత్రులకు కారు ఉచితంగా ఇవ్వడం లేదు. డబ్బు అప్పుగా తీసుకొని కారు కొనుక్కోవాలి. వాయిదాలమీద ఆఅప్పు తీర్చుకోవాలి. యథార్థానికి, మంత్రుల జీతాలు చాలా తక్కువ. వారికి ఇల్లు, విద్యుచ్ఛక్తి ఉచితంగానే లభిస్తాయి. కేంద్రంలో కొందరు మంత్రులకు అతిథి సత్కా రాలకయ్యే ఖర్చుల క్రింద నెలకు రు500 ఇస్తారు. వారు ఇదిఇవ్వరు కాని ప్రభుత్వ ఆహ్వానంపై వచ్చే అతిథులకు నేను సత్కారంచేస్తే ఆఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది."

"అతిథులకోసం, వారికిచ్చే విందులు మొదలైన వాటికి, మంత్రులు ఎంతో ఖర్చు పెట్టాల్సి ఉంటుంది. ఈసంగతి మీరు గుర్తుంచుకోవాలి. అతిథులను బాగా మర్యాదచేయడం భారతీ సంప్ర దాయం" అని నెహ్రూ అన్నారు.

### రాష్ట్రపతి భవనం

ఢిల్లీలో రాష్ట్రపతి భవనం, రాష్ట్రా లలో రాజభవనాలనిర్వహణకయ్యే ఖర్చులను ప్రధానమంత్రి ఇలా వివరిం చారు.

"ఈ భవనాలనువదలి, రాష్ట్రపతి,రా ష్ట్రాల్లోగవర్నర్లు చిన్న ఇళ్ళకు మారినా ఖర్చేమీ కలసిరాదు. ఇదివరలో లార్డ్ మౌంట్‌బాటెన్, అతరువాత శ్రీరాజ గోపాలాచారి, ఇంత పెద్దభవనం ఎందుకు చిన్న ఇళ్లకు మారతామని అన్నారు. కాని తీరా లెక్క చూస్తే, ఇలా చిన్న ఇళ్ళకు మారినందున కలసిరాకపోగా, యింకా ఎక్కువ ఖర్చు అవుతుందని తేలింది. రాష్ట్రపతి భవనాన్ని నిర్వ హించక తప్పదు గదా. దీన్నిలా నిర్వ హిస్తూ, రాష్ట్రపతి, ఇంకోచోట ఎక్క డైనా నివసిస్తుంటే, అయింటికయ్యే ఖర్చుకూడా భరించాల్సివస్తుంది. అందు వల్ల యీ సంకల్పం మానుకోవడమైంది. వాస్తవానికి రాష్ట్రపతి, ఆ మహా భవనంలో, ఏదో ఒక మూరు మూలఉంటున్నారు. మిగతా భవనంలో, వస్తుప్రదర్శనశాల, ప్లానింగు కమీషన్ కార్యాలయం, మంత్రివర్గ సచివాలయం ఉన్నాయి. ఇవిగాక అతి థులగదులు, బాంక్వెటింగ్ మందిరాలు రాష్ట్రపతి సిబ్బందికి కార్యాలయాలు ఉన్నాయి. అయితే రాష్ట్రపతిభవనం, రాష్ట్రాల్లో రాజభవనాలు, వీటికయ్యే ఖర్చులు కొంత తగ్గించడానికి తప్ప కుండా వీలున్నదనే నా అభిప్రాయం"

రాష్ట్రపతి,గవర్నరు పదవులు పెద్ద హోదాగల పదవులు, వీటి హుందా తనాన్ని కాపాడాలని, ఇది ఏదో అప దవి నిర్వహించేవారికోసం గాక, ఆ పద వుల హోదాకోసం ప్రభుత్వానికి యీ ఖర్చు తప్పదని నెహ్రూ అన్నారు.

### అశోక హోటల్

అశోక హోటల్ సంగతి చెబుతూ ఇలా అన్నారు.

"ఈ హోటలుకో పెద్దభవనం కట్టిం చినందుకు ప్రభుత్వాన్ని కొందరు విమ ర్శించారు. ఆ తరువాత వారు సైనా వెళ్లి వచ్చారు. ఎన్ని ప్రతినిధివర్గాలు ఆ దేశానికి రావడంబట్టి, వారి సౌకర్యం కోసం అక్కడి యింతకన్నా పెద్దహో టళ్లు నిర్మించారు. అది చూచి, ఆదిలో విమర్శించిన, యీ పెద్దలు కిమ్మన కుండా ఊరుకొన్నారు."

### మంత్రులజీతాలు తగ్గిస్తే

కేంద్రమంత్రుల జీతాలు తగ్గిస్తే, వారికి మోటారు కారు భత్యం యివ్వాలి. అయినా యితరదేశాలతో పోల్చిచూస్తే, మనమంత్రుల జీతాలు ఏమీ ఎక్కువకావు అని ప్రధానమంత్రి అన్నారు.

### స్వవిషయం

తన విషయం వేరు అంటూ, పుస్త కాలమీద వచ్చే రాయల్టీవల్ల తనకు యితరులకు చాలా తేడా ఉందని నెహ్రూ చెప్పారు.

"ఒకప్పుడు ఈ డబ్బు రావడం దాదాపు ఆగిపోయింది. కాని అతరు వాత నా పుస్తకాలను ఇతర భాషల్లోకి తర్జుమాచేయడంవల్ల, కొంచెం ఎక్కువ డబ్బు రావడం మొదలైంది. ఈ వచ్చే డబ్బులోకూడా నూటికి 80, 85 వం తులు పన్నులక్రింద పోయి మిగతా 15, 20 వంతులు మాత్రమే నా చేతికి వస్తుంది. ఇదిగాక, నేను పోషించి చదువుసంధ్యలు చెప్పించాల్సిన పిల్ల లెవరూ లేరు. నాకున్నదల్లా ఒక్కతే కుమార్తె. ఆమె సంగతి ఆమె చూచు కోగలదు. అందువల్ల నాపని కొంచెం తేలిక. మరి మిగతా మంత్రులకో పెద్ద సంసారాలు, బాధ్యతలు ఉన్నాయి" అని ప్రధానమంత్రి అన్నారు.

### 6 ఓట్ల తేడాతో తీర్మానం ఓటమి

ఈ అనధికార తీర్మానంపై, అఖిల భారత కాంగ్రెసు సంఘంలో, తీవ్ర అభిప్రాయభేదం కన్పించింది. 70 నిమి షాలసేపు చర్చ జరిగినతర్వాత, తీర్మా నాన్ని ఓటుకు పెట్టగా 6 ఓట్లు తేడాతో మాత్రమే తీర్మానం వీగిపోయింది. తీర్మానానికి అనుకూలంగా 32 ఓట్లు ప్రతికూలంగా 82 ఓట్లు వచ్చి, తీర్మా నం ఓడిపోయినట్లు అధ్యక్షులు శ్రీ ఢేబర్ ప్రకటించగానే, విడివిడిగా ఓటు తీసుకోవాలని, తీర్మాన ప్రతిపాద కులు శ్రీ బనారసీదాస్ (యు. పి) కోరారు. ప్రధాన కార్యదర్శి స్వయం గా, అనుకూల, ప్రతికూలురను లెక్క పెట్టారు గనుక, వేరువేరుగా ఓటు తీసుకోనవసరం లేదని, శ్రీ ఢేబర్ అన్నారు.

ఓటింగుజరిగేసమయంలో నెహ్రూ సభలో లేరు. వేదిక నానుకొనిఉన్న గదిలో, కొందరు రాష్ట్ర కాంగ్రెసు నాయకులలో మాట్లాడుతున్నారు. బహుశః ఓటు తీసుకొంటున్నట్లు ఆయ నకు తెలియదు.

### సామాన్యులవలె కాంగ్రెసువారు జీవించాలి

తీర్మాన ప్రతిపాదకులు శ్రీ బనారసి దాస్ సామ్యవాద సమాజాన్ని కాంగ్రెసు నిజంగా కోరుతున్నదని ప్రజలకు నమ్మకం కలగాలంటే, కాంగ్రెసువారు జీతాలు తగ్గించుకోవడం అవసరం, కాంగ్రెసువారికి యిక గరిష్ట వేతన ప్రమాణం నిర్ణయిస్తే సామ్యవాద వ్యవస్థ నెలకొల్పడానికి యిక తొలి చర్య తీసుకొన్నదని ప్రజలనుకొంటారు. నిజమైన కాంగ్రెసువారంతా సామాన్య ప్రజలమాదిరే జీవించడానికి ప్రయత్నిం చాలి" అన్నారు.

శ్రీ వీరేంద్ర వర్మ, చౌధ్రీ జశర్మ యీ వాదాన్ని గట్టిగా బలపర్చారు. సమున్నత ఆలోచనలు, సామాన్య జీవితం గాంధీజీ ఆదర్శం. ఆ ఆదర్శాన్ని కాంగ్రెసు వారంతా అనుసరించి ఆ ప్రకారం నడుచుకోవాలి, అని శ్రీ శర్మ అన్నారు.

శ్రీమతి సుభద్రజోషి ఒక్కరు మాత్రం తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడారు. పదవులలో ఉన్న కాం గ్రెసువారికి కొన్ని అవసరాలు, ఖర్చులు ఉంటాయని, యీ చర్చలలోకి గాంధీజీ ప్రసక్తితేవడం ఏమంత మంచిపని గాదని ఆమె వాదించారు.

### కాంగ్రెసు అభ్యర్థుల నిర్ణయ పద్ధతి

ప్రతి నియోజకవర్గంలోనూ, 5 గురు కాంగ్రెసు కార్యకర్తలనుండి, పార్ల మెంటు, శాసనసభ ఎన్నికలకు అభ్యర్థు లను ఎంచాలంటూ, ప్రతిపాదితమైన అనధికార తీర్మానాన్ని, ఉపసంహ రించుకొన్నారు. పార్టీ నియమావళి సవరణలను పరిశీలించే ఉపసంఘం యీ విషయం చూస్తుందని, అధ్యక్షులు శ్రీ ఢేబర్ హామీ యిచ్చారు. ఆ అనంతరం తీర్మానం ఉపసంహృతిమైంది.

చిన్న జీతానికి, పెద్ద జీతానికి తేడా 10 రెట్లకన్నా ఎక్కువ ఉండరాదనే మరో అనధికార తీర్మానాన్ని సభ నిరాకరించింది.

అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం ముగించబోయే ముందు శ్రీ ఢేబర్ మాట్లాడుతూ, ఆహార సమస్య పై చేసిన తీర్మానాన్ని మనస్సులో పట్టించుకొని, తమ తమ రాష్ట్రాలలో ఆహారోత్పత్తి పెంచ డానికి, గట్టిగా ప్రయత్నించాలి అని కాంగ్రెసు వారందరికి విజ్ఞప్తి చేశారు. ప్రణాళిక జయప్రద మవడమన్నది, వ్యవసాయ సాధన సంపత్తిపై ఆధార పడి ఉంటుందని ఆయన హెచ్చ రించారు.

## నెవడాలో రెండో అణ్వస్త్ర పరీక్ష

లాస్‌వెగాస్ (నెవడా), జూన్ 2: నెవడాలో అమెరికా రెండవఅణ్వస్త్ర పరీక్షను జరిపింది. పరీక్ష జరగగానే పొగతో ఒక గుండ్రని మేఘం సుమారు పదివేల అడుగుల ఎత్తుకుపోయింది. దాని వెంబడిని కొన్ని విమానాలు కూడా వెళ్లాయి. ఈ పరీక్ష జరిపిన ప్రాంతానికి 8 మైళ్ళ దూరంలో 250 మంది సైనిక పరిశీలకులు ఉన్నారు. ఈ పరీక్ష జరిపిన ప్రాంత పరిసరాలలోని పందులలోను, కోతులలోను ఎలుకల లోను ధార్మిక శక్తి ప్రసారం జరిగింది. ఈ జంతువుల సహాయంతో ఈ పరీక్ష ఫలితాలను కనుగొంటారు.

# ఉత్పత్తి పెంచేందుకు ధాన్యాలకు కనీస ధర

## అ. భా. కాంగ్రెసు సంఘ నిర్ణయం: అన్ని అధికార తీర్మానాల ఆమోదం

న్యూఢిల్లీ, జూన్ 2: అఖిల భారత కాంగ్రెస్ సంఘం రెండు రోజుల సమావేశం నేటితో అంతమైంది. తిరిగి ఆగస్టులో ఈ సంఘం సమావేశ మౌతుం దని, అప్పుడు, కాంగ్రెస్ నియ మావళిలో మార్పులనుగూర్చిన నిర్ణయాలు జరుగుతాయని కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఢేబర్ తమ ఉపసంహారోపన్యాసంలో ప్రకటించారు. అయితే ఈసారి ఈ సమావేశం ఎక్కడ జరిగేది ఇంకా తేలలేదు. మైసూరు, హైద్రాబాదు, విదర్భ, మహా కోసల్‌లు ఆహ్వానాలు అంద జేశారు. వీటిలో దేన్నో ఒక దాన్ని ఆమోదించవచ్చు.

### తీర్మానాలు

నేటి సమావేశంలో ఈ సంఘం రెండవ ప్రణాళికను గురించిన తీర్మా నాన్ని, ఆహారధాన్యాలకు కనీసపుధరను నిర్ణయించాలన్న తీర్మానాన్ని, ఆర్థిక పరిస్థితిని గూర్చిన తీర్మానాన్ని, ఆహార పరిస్థితిని, ఆహార ధాన్యోత్పత్తిని గురిం చిన తీర్మానాన్ని, ఆమోదించింది. మంత్రులు, జీతాలు తగ్గించుకోవా లంటూ, శ్రీ బనారసీదాస్ ఒక తీర్మా నాన్ని తెచ్చారు. దీన్ని గూర్చి చర్చ జరిగింది. ఈ తీర్మానాన్ని ఈ సంఘం తిరస్కరించింది.

### ఈ తరంలోనే సామ్యవాదం

ప్రణాళిక లక్ష్యాలను గురించిన తీర్మానాన్ని గూర్చిన చర్చలో ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, ఆర్థికమంత్రి శ్రీ కృష్ణమాచారి, కూడా మాట్లాడారు. ఆర్థికమంత్రి తమ పన్నులను సమర్థించు కున్నారు. దేశాన్ని సామ్యవాదపురస్తా మీదుగా, ఈ పన్నులు, నడిపించుకు పోతాయని ఆయన వాదించారు. వీటి సహాయం మన జీవితంలోనే, సామ్యవా దం, దేశంలో, స్థాపన కావడంచూడగల మన్నదిలాసానుకూడా ఆయన ఈ సం దర్భంలో వ్యక్తంచేశారు.

### వేతన సంఘాలు

చర్చకు ప్లానింగుమంత్రి శ్రీ నందా సమాధానం చెప్పారు. దేశంలో వివిధ పరిశ్రమలలోని కార్మికులకు వేతనాలను నిర్ణయించేందుకు ప్రభుత్వం వేతన సంఘాలను నియమించబోతున్నట్లు ఈ సందర్భంలో ఆయన వెల్లడిచేశారు. అయితే సభ్యులు రెండో వేతన నిర్ణా యక సంఘాన్ని (పేకమిషన్‌ను) వేయ వలసిందిగా, కోరికకోర్కాను, ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, ఆర్థికమంత్రి శ్రీ కృష్ణమాచారకూడా తిరస్కరించారు. ఈ ఇద్దరు ఆకోర్కపట్ల సానుభూతి చూపించారుగాని, అందుకు ఇది సమ సమయంకాదని, ఇప్పుడు అటువంటి సంఘాన్ని వేస్తే కొత్తసమస్యలు పుట్టి, ద్రవ్యోల్బణానికి దారితీస్తాయని వాదిం చారు.

### రైతులకు కనీసపు ధర

అధికమైన పంటను రైతులు పండించేందుకు వీలుగా, వారికి తగు ఉద్దీపనం కల్పించే నిమిత్తం, ధాన్యాలకు కనీసపు ధరను నిర్ణయించా లన్న తీర్మానాన్ని పండిత పంత్ ప్రతిపాదించారు. రైతులకు కనీసపు ధరను ఇప్పించడమేగాక, వర్తకులు, అంతకుమించి అమ్మడానికి వీలులేని ధరను కూడా ఒకదాన్ని నిర్ణయించ వలసి వుంటుందని ఆయన ఈ సంద ర్భంలో మాట్లాడుతూ అన్నారు.

ఈ సమావేశంలో దేశం అంతరంగిక సమస్యలను గూర్చి జరిగినంతగా విదే శాంగ వ్యవహారాలనుగూర్చి చర్చ జరగలేదు. విదేశాంగ విధానం సంగతి ఇక్కడ బాగా అడుగున పడిపోయింది.

### జీతాలనుగూర్చిన తీర్మానం

శ్రీ బనారసీదాస్, మంత్రుల జీతాల తగ్గింపునుగూర్చి తెచ్చిన తీర్మానంమీద చర్చ, ఓటింగుకూడా ఎవ్వరు అనుకోనట్లు జరిగాయి. ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ మంత్రుల జీతా లను సమర్థిస్తూ మాట్లాడినా, 70 మంది సభ్యులలోను 32 మంది, ఈ తీర్మానా నికి అనుకూలంగా ఓటుచేశారు. శ్రీ దాస్ ఇందులో మంత్రుల జీతాలను రు. 1000 లకి తగ్గించాలని సూచిం చారు. ఇది ఓడిపోయింది. కాని సభ్యుల మాటలవల్ల, దీనికి అనుకూ లంగా వచ్చిన ఓట్లవల్ల, ఈ విషయం కాంగ్రెస్ వారులను ఎంతగా బాధిస్తు న్నదీ వ్యక్తంఅవులోంది. ప్రజలమీద పన్నులువేసి, వారిని త్యాగాలుచెయ్య మంటున్నప్పుడు, మంత్రులు కూడా త్యాగాలుచేసి, ప్రజలకు మార్గదర్శకులు కావడం మంచిదని చాలా మంది సభ్యులు వాదించారు.

### శ్రీ నందా తీర్మానం

ఆర్థికపరిస్థితినిగురించి, పంచవర్ష ప్రణాళికనుగురించి, ఒకే తీర్మానాన్ని, కార్యవర్గం సభముందు వుంచింది. వారి తరఫున శ్రీ నందా, దాన్ని, సభవారి ముందు వుంచారు. సభ్యులు ఈ తీర్మా నానికి కొన్ని సవరణలను ప్రతిపాదిం చారు. పరిపూర్ణానంద్ వర్మ, ఈ తీర్మా నంలో, జనాన్ని, పన్నులను భరించ డానికి వారు ముందుకు వస్తున్నందుకు అభినందించాలని, ఒక సవరణతో సూచించారు. ఇంకా ఇట్లాగే కొన్ని సవరణలు వచ్చాయి. కాని ఇవిఅన్నీ వీగిపోయినాయి. కాంగ్రెస్ కార్యదర్శి శ్రీశ్రీమన్నారాయణ్ తెచ్చిన అల్పమైన సవరణలతో, తీర్మానాన్ని, అ. భా. కాంగ్రెస్ సంఘం ఆమోదించింది.

### సభ్యుల సూచనలు

దీనిని గూర్చి జరిగిన చర్చలో శ్రీరాం శరణ్ శర్మ, శ్రీ ధీరేంద్రవర్మ, శ్రీభాగ వత్‌ఝా అజాద్, శ్రీ ఎన్. వి. గాడ్గిల్ శ్రీ సి. ఎల్. వ్యాస్, శ్రీ కె. కె. షా, శ్రీ సింహాసన్‌సింగ్, శ్రీ కమల్ నయన్ బజాజ్ లు పాల్గొన్నారు. ప్రతి పరిశ్ర మను గూర్చి ఒక వేతన సంఘం వెయ్యా లన్న సూచన, శ్రీ అజాద్ దగ్గరనుంచి వచ్చింది. కొంతమంది ప్రభుత్వాన్ని ఖర్చులు తగ్గించుకోవలసిందని సూచిం చారు.ధనవంతులకుపన్నులలో ప్రభుత్వం రాహితీ చూపిస్తున్నందుకు శ్రీ గాడ్గిల్ విచారించారు. ప్రభుత్వం ఇట్లా ఇచ్చిన రాహితీ 7 కోట్లపై చిలుకు దాకా వుంది దీనివల్ల 127 మంది లక్షాధికార్లు లాభం పొందుతున్నారు. ఇది జరగ రాని పని. రాజ్యాంగాన్ని ప్రగతి శీలంగా అమలు జరపాలగాని, ఇట్లా మాత్రం కాదు అన్నారు.

### ఇది పాశ్చాత్యమైంది

శ్రీ కమల్‌నయన్ బజాజ్ ఆస్తి పన్నును విమర్శించారు. ఇది పాశ్చాత్య మైనదని, మన దేశానికి తగదని వాదిం చారు.

### ఆహార సమస్య

రైతుకు ధరలద్వారా ఉద్దీపనాన్ని ఇవ్వడాన్ని గూర్చిన తీర్మానాన్ని పండితపంత్ ప్రతిపాదించారు. ఇం దులో అధికాహారోత్పత్తి వ్యవహారం కూడా వుంది. దీన్ని ప్రతిపాదిస్తూ పండితపంత్ ఈలా అన్నారు. "పంట పెరగాలంటే రైతుకు మంచి ధర గిట్టేట్టుచూడాలి. ధాన్యాలకు కనీసపు ధరలను నిర్ణయించటమే గాక, బజారులో ఆధాన్యాన్ని ప్రభుత్వం ఏ ధరకు కొనేదికూడా నిర్ణయించాలి. అప్పుడు వర్తకులు దొంగలాభాలు చెయ్యడం తగ్గుతుంది. ధరలు సమ పాళంగా కూడా, అందువల్ల, వుంటాయి."

### శ్రీ రాజు సూచన

శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు ఈ తీర్మానాన్ని బలపరిచారు. భూమి సంస్కరణలను త్వరితగతిని అమలు పరచవలసిన అవసరాన్ని గూర్చి ఈయన మాట్లాడారు. శ్రీ సింహాసన్‌సింగ్, శ్రీ ఫూల్ సింగ్, శ్రీ నారాయణ చౌదరి, శ్రీరాంనివాస్ శర్మ, శ్రీ వీరేంద్రవర్మ, ప్రభృతులు, దీనిమీద మాట్లాడారు. కాంగ్రెసు కార్యదర్శి శ్రీ శ్రీమన్నా రాయణ్, ఈ తీర్మానం, కాంగ్రెసు వారికి గ్రామాలలో చేతినిండా పనిని కల్పిస్తుందని, సైనులకు సలహాలు, ఆధ్వ ర్యం ఇవ్వగలవు, కాంగ్రెసు కార్యకర్త లకు శిక్షణ ఇవ్వాలని, అందుకోసం శిక్షణకేంద్రాలను పెట్టాలని సూచిం చారు.

సంఘంవారు ఈ తీర్మానాన్ని కూడా ఏకగ్రీవంగా ఆమోదించారు.

# సికిందరాబాదు పురపాలక ఉద్యోగుల జీతాల నిరాకరణ

## కరువుభత్యం ఎక్కువ చేయనందుకు ఆక్షేపణ

హైదరాబాదు, జూన్ 3: కరువు భత్యాన్ని ఎక్కువ చేయనందుకు అధి క్షేపణగా జూన్ మొదటి తేదీన మే నెల జీతాలను సికిందరాబాదు పురపాలక సంఘ ఉద్యోగులు తీసుకోలేదు.

రు 100 లోపు వేతనాల ఉద్యోగు లకు రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల మంజూరు చేసిన రు 5 అదనపు కరువు భత్యం సౌకర్యం స్థానిక సంస్థల ఉద్యో గులకు కూడా వర్తిస్తుంది. అయితే, హైదరాబాదు, సికిందరాబాదు పుర పాలక సంఘాలు తమ సిబ్బందికి ఇంత వరకూ కొత్త పద్ధతిన కరువు భత్యం ఇవ్వలేదు. అందుకని సికిందరాబాదు పురపాలక సంఘం నెలసరి సమావేశం జరుగుతూండగా పనివారు ఊరేగింపు, ప్రదర్శనలూ జరిపారు.

ఆ ఊరేగింపులో పోలీసు వారికీ ప్రదర్శన జరిపే వారికీ సంఘర్షణ జరిగింది. నలుగురు గాయపడ్డారు. ఒకరు స్పృహతప్పి పడిపోయినారు.

ప్రభుత్వ ఉత్తరువును అమలు జరుపుతామని నే పురపాలక సంఘం అధ్య క్షుడూ కమీషనరూ ఇంతవరకూ హామీ ఇస్తున్నారు. కాకపోతే నిర్వహణకు సంబంధించిన కొన్ని చిక్కులవల్ల ఈ ఆలస్యం జరిగింది.

### హైదరాబాదు పురపాలక సంఘ ఉద్యోగుల కోరికలు

ఈ రు 5 అదనపు కరువుభత్యాన్ని ఈలోగా పురపాలకసంఘం మంజూరు చేయకపోతే జూన్ 11 న ఒక పూట సమ్మె చెయ్యాలని హైదరాబాదు పుర పాలక మజ్‌దూర్ సంఘ కార్యవర్గం నిన్న తీర్మానించింది.

ఆర్థికశాఖ కార్యాలయం ఎదుట ఆరోజున ప్రదర్శన జరపాలని కూడా తీర్మానించారు. మొత్తం 4500 మంది పురపాలక సంఘ ఉద్యోగుల కూడాను ఈ మజ్‌దూర్ సంఘంలో 3 వేలమంది సభ్యులుగా ఉన్నారట.

## కాంగ్రెస్ నిబంధనావళి

న్యూఢిల్లీ, జూన్ 2: కాంగ్రెసు నియమావళిని సవరణనుగూర్చిన ప్రతి పాదనలను పరిశీలించడానికి కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఢేబర్ 16 మంది సభ్యు లతో ఒకసంఘాన్ని నియమించారు.

ఈ ప్రతిపాదనలనుగురించి వివిధ రాష్ట్రాల భావాలను తెలుసుకొని, వీరు జూన్ 30 లోగా తమ నివేదికలను అందజేయవలసివుంది.

ఈ సంఘంలో సభ్యులు: (1) అరు ణ్యఘోష్ (2) శ్రీ మునీశ్వర్ దత్ ఉపా ధ్యాయ (3) శ్రీ టి. ఆర్. దేవగిరికర్ (4) శ్రీ కె. కె. షా (5) శ్రీ చౌదరీ బ్రహ్మప్రకాశ్ (6) శ్రీ సత్యనారా యణరాజు (7) శ్రీ రాజారాంబాయు డు (8) శ్రీ జైరామ్‌వ్యాస్ (9) శ్రీ గోపాల్‌రావు ఖేడ్కర్ (10) శ్రీ సేక్ గోవిందదాస్ (11) శ్రీలాల్ బహా దూర్ శాస్త్రి (12) శ్రీ జగ్జీవనరాం (13) శ్రీ బల్వంతరాయ్ మెహతా (14) శ్రీ ఎస్. కె. పాటిల్ (15) శ్రీ యు. ఎన్. మల్లయ్య (16) శ్రీ కె. పి. మాధవన్.

# సంపాదకునకు లేఖలు

## బొడ్డువారిపాలెం కేంద్రానికి విద్యుచ్ఛక్తి

ఆర్యా, నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా బొడ్డువారిపాలెంకేంద్రంలో మూడు పెద్ద గ్రామాలూ, ఏడుమజరా గ్రామాలూ ఉన్నవి; రెండు పంచా యతీలున్నవి; రెండు బియ్యం మిల్లు లున్నవి. వ్యవసాయానికి వినియోగపడే బావులుకూడా చాలా ఉన్నవి. ముచ్ ఖండ్ నుంచి విద్యుచ్ఛక్తిని సప్లయిచేసే తీగెలు ఈ గ్రామాలకు అరుఫర్లాంగుల దూరం మీదుగా పోతున్నవి.

ఈ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేసే రు 80 వేల పథకాన్ని కిందటి సంవత్సరం గూడూరు జూనియర్ ఇంజ నీరు తయారుచేసి అధికారులకు పంపిం చారు. నెల్లూరు డివిజనల్ ఇంజనీరు, అనంతపురంసూపరింటెండింగ్ ఇంజనీరు కూడా ఈ పథకాన్ని సిఫార్సుచేశారు. చివరికి గిట్టుబాటయినది కాదనే కారణాన ఈ పథకాన్ని ప్రభుత్వం తోసి వేశారు. నిజానికి ఈ పథకం వివరాలను పరిశీలిస్తే ప్రభుత్వం ఆశిస్తున్న నూటికి రు10 కంటే ఎక్కువే-అంటే-సుమారు రు 11-8-0 దాకా రాబడివచ్చే అవకా శం ఉన్నదని విశదమవుతుంది. ఈ పథ కాన్ని మళ్లీ పరిశీలించి అమలు జరిపించ వలసినదిగా విద్యుచ్ఛక్తిశాఖ ప్రధాన ఇంజనీరుకు విజ్ఞప్తి చేస్తున్నాను.

బొడ్డువారిపాలెం. పెళ్ళకూరు గోపీకృష్ణ.

* * *

## ఫిర్యాదుచేసినా లాభం లేదా?

ఆర్యా, కాకినాడలో ఈ మధ్య దొంగతనాలు చాలా ఎక్కువైనవి. కిందటి నెలలో ఒక రైల్వేఉద్యోగి ఇంట్లో దొంగలుపడి 30 కాసుల బంగారమూ, కొంత రొఖ్ఖమూ ఎత్తుకుపోయినారు. అదేరాత్రి ఒక ఆడమనిషి చెవిపోగులేదని చెవితో సహా కోసుకుపోయినారు. ఇటువంటి దొంగతనాలు చెప్పాలంటే చాలా జరిగినవి. మరి ఇంట్లో పడుకొనే వాళ్ళను దొంగలు బెదిరించి నగలు ఎత్తుకుపోయిన సందర్భాలు కూడా ఉన్నవి. పోలీసులకు ఫిర్యాదుచేసినా మచ్చుకు ఒక్క-దొంగతనానైనా వారింతవరకూ పట్టుకున్నట్టుకనిపించదు. పైగా ఇదేమిటండీ అంటే "వెనకటి రోజులలో అయితే అనుమానం ఉన్న వాళ్లను పెడితే అసలుదొంగ బయట పడేవాడు ఇప్పుడటువంటిదేమీ వీలులేదు చోరీ ఆస్తి దగ్గరుంటేగాని దొంగను పట్టుకునేందుకు వీలులేదు" అని అంటు న్నారు. పోలీసుశాఖ సంగతేమో కాని సాయంకాలమయ్యేప్పటికి మాత్రం పౌరులకు భయం భయంగా ఉంటుంది. ఈ పరిస్థితిని గమనించి దొంగతనాల నివారణకు కట్టుదిట్టాలు చేయించవలసి నదిగా అధికారులకు విజ్ఞప్తి.

కాకినాడ, వి. ఎస్. లక్ష్మి

* * *

## ప్రకాశంగారికి సముచిత స్మృతి చిహ్నం

ఆర్యా, "ఈసారి కాల్చండి చూదాం" అని ప్రకాశం పంతులు గారు, సైమన్ కమిషన్ రాక సంద ర్భంలో పోలీసుల తుపాకులకు ఎదురు నిలచిన చోట ఆయనస్మారక చిహ్నాన్ని ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఆస్థలాన్ని పవిత్ర యాత్రా స్థలంగా రూపొందిం చాలి. అక్కడ ప్రకాశం పంతులుగారి శిలావిగ్రహాన్ని నెలకొల్పడమే ఆయ నకు సముచితస్మారకచిహ్నం కాగలదు.

తణుకు, కొట్రాలపల్లి సుబ్బారావు.

* * *

## "ఆబిద్‌రోడ్ బస్సు స్టాపింగ్-మార్పు"

ఆర్యా, మే నెల 20 వ తేదీ నుండి ఆబిద్ రోడ్ బస్సు స్టాపింగును చాలా దూరంగా ఉన్న ట్రూప్ బజారు ఏరియా సాగర్ టాకీసు చివరకు మార్చి నారు. ఆబిద్ రోడ్డులో గత 25 సంవ త్సరాలనుంచీ ఉన్నటువంటి ఈ స్టేజిని ఈవిధంగా ఒక్కసారిగా అంతదూరం నెట్టివేసినట్లుగా మార్చినారు. ఈ మార్పువలన ప్రజలు ముఖ్యంగా ఆబిద్ రోడ్‌లో పనిమీద అనేకమంది అనేక చోట్లనుండి వచ్చే వారు ఎంతయిబ్బంది పడుతున్నారో పై అధికారులు గుర్తించినట్లుగా లేదు. ఈ యిబ్బందు లను వెంటనే అధికారులు గుర్తించ వలెను. 8 వ నెంబరు బస్సు స్టాపును ఆబిద్ రోడ్ సెంటరులోను, 7 వ నెంబరు బస్సు స్టాపును పిస్తాలు హౌస్ వద్దను మార్చితే చాలా బాగుం డును.

ప్రతిపాక నరసింహారావు. ఖైరతాబాదు, హైదరాబాదు

